అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము,

తృతీయగ్రంథము 3.

చెలికాని లచ్చారావు,

సంపాదకుడు.

# వాల్మీకి చరిత్రము.

ఇది

రఘునాథభూపాలుని ప్రణీతము.



మొదటికూర్పు.

శ్రీ రామవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

చిత్రాడ.

1919.

వెల రు 0—8—0.

# పీఠిక.



ఈ గ్రంథంబును రచియించిన రఘునాథభూపాలుఁడు క్షత్రియవంశజుఁడు. ఈతఁడు సుప్రసిద్ధకవివర్యుండును, భాషాపోషకుండును, మహారాజును నై యున్నాఁడు. ఈతని కవిత్వము లలితార్థ చమత్కార పదభూయిష్ఠమై, స్వభావోక్తి చణమై, పండిత పామర కర్ణరసాయనంబై, మృదుమధుర శైలితో నెంతయు సమయోచితవర్ణనలతో నొప్పారుచున్నయది. వ్యర్థపద ప్రయోగంబులు గానరావు.

క. "చెప్పవలెఁ గప్పురంబులు, కుప్పలుగాఁ బోసినట్లుఁ గుంకుమ పైపైఁ
గుప్పివకస్త్రియ విరి పొట్లము, విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్.

క. చెవులకుఁజవులై చల్లఁగఁ, గవులకుఁదవులై సమస్త కావ్య కళా బం
ధువులై రససింధువులై, యవురా? యనఁ గవితల వనినలరఁగవలదా,,.

అను నీతని పద్యములవలన నీతనిమతము స్పష్టమగుచున్నది.

ఇతని కవిత్వశైలిఁ దెలియుట కొకపద్యమిందు నుదాహరించుచున్నవాఁడ.

ఉ. బోయమిటారి గుబ్బెతలు పున్నమవెన్నెల బైట నీపయిం
బాయని బాతికిన్నరలు మాటికిమీటుచు నీప్రతాపమున్
హాయనిచొక్కిపాడ వినవా కనవా మనవారిఁబాసి నీ
వీరొడనోంటినుండఁ దగవే తగవే చను దెమ్ము వీటికిన్.

ఈ వాల్మీకి చరిత్రమునందు సప్తద్వీపాదుల నైసర్గిక స్థితులును, ఆయానదులు పుణ్యక్షేత్రాదులు మొదలగువాని పవిత్రతయు మహత్త్వాది విశేషంబులును, వాల్మీకి జ్ఞానోపదేశపథంబును, బోయల చర్యలును, వాల్మీకినిశ్చల చిత్తంబును, రంభోర్వసుల గర్వభంగంబును మొదలగునెన్నియో విశేషాంశంబులు రక్తిమెయి వర్ణింపఁబడినవి.

ఈయన వాల్మీకి చరిత్రమువేగాక రామాయణము, భాగవతసారము, నలచరిత్రము, పారిజాతాపహరణము, అచ్యుతాభ్యుదయము, జానకీపరిణయము, మొదలగు గ్రంథంబులను స్వయముగా రచియించి పెక్కు సంస్కృతాంధ్రగ్రంథంబులను కృతినందెను.

మా "ఆంధ్రపరిశోధక మహామండలి"కిఁ బ్రస్తుతము వాల్మీకిచరిత్రము నలచరిత్రము మాత్రము లభ్యమయినవి. ఈయన గ్రంథంబుల గుఱించిగాని కవిత్వము నుగుఱించిగాని క॥ వీరేశలింగముగారు కవులచరిత్రయందు నేమియు వ్రాసియుండ లే

డు. విద్యావంతుని వలెను వంశమునుగుఱించి మాత్రము చేమకూర వేంకటకవి సందర్భమున వ్రాసిరి. వేంకటకవి విరచిత విజయవిలాస సారంగధరాది సుప్రసిద్ధాంధ్రప్రబంధరత్నంబులను కృతినందిన మహనీయుఁడీతఁడే. నేటికినిగల తంజావూరుపాతకుల ప్రసిద్ధికి గానవిద్యను మహోన్నతదశకుఁదీసికొనివచ్చిన పూజనీయుఁడీతఁడే. ఈతనిసంస్థానంబున వేలకొలఁది సంస్కృతాంధ్ర సంగీతవిద్వాంసులగు పురుషులేగాక సంగీతసాహిత్యాది శాస్త్రవిశేష ప్రవీణురాండ్రును, ప్రబంధ నిర్మాణదక్షురాండ్రును నగు స్త్రీలుగూడ పెక్కుమంది పోషింపఁబడుచుండిరి. ఈకవిరాజవతంసుని సభావిశేషంబులు మధురవాణియనెడి వేశ్య విశేషముగా వర్ణించినది. ఈగణిక కవయిత్రి యాప్రభుమణి రామాయణమ్మును సంస్కృతభాషలోనికిఁ బరివర్తించినది. ఈమె వీణాగాన, వ్యాకరణశాస్త్ర, వివిధావధాన కవిత్వములందు బ్రవీణురాలైనట్టు తనచరిత్రమునందు వ్రాసికొనియున్నది. ఈయన పరిపాలనంబున స్త్రీవిద్యయే యింతయున్నతస్థితియందుండినపుడు పురుషులయందు విద్యయెంతమహోన్నత దశయందుండెనో యూహించెదరుగాక.

ఈతఁడు కవిరాజేగాక భక్తిజ్ఞాన సంపన్నుఁడై దేవాలయ, తటాక, సత్రాది సప్తసంతాన ప్రతిష్ఠాపనాపరుఁడై, ధార్మికుఁడై వేలకొలఁది జనవ్యూహమునకు నిరతాన్నప్రదాతయైనపుణ్యపురుషుఁడు. ఈతని పవిత్ర చరిత్ర విశేషంబులు ముఖ్యాతమంబులు. ఈగ్రంథంబునందంతయు గద్యమువలనఁ జాలవరకుఁ దెలియఁగలవని విరమించుచున్నవాఁడ. ఈతనిఋణము మనమెంతఁ బొగడినను దీర్చుకొనఁగలమా? ఈతని దేశసేవనుగుఱించి వ్రాసిన నెంతయేని గ్రంథమగును, ఈపవిత్ర చరిత్రుని 1650 సంIIన మృత్యుదేవత తనవాత బెట్టికొనెనని జెప్ప నాకలమాఁడకున్నది. ఎట్టివానికైన జావు నిశ్చయముగదా? ఎందరురాజులు భువిని బుట్టలేదు? గిట్టలేదు? లోభమోహాదులందగుల్కొని కృశించి జీవచ్ఛవంబులై బ్రతుకలేదు? రఘునాథభూపాలాగ్రణీ నీవంటి యుదారపురుషుఁడు, భాషాజ్ఞాని, దేశాభిమాని, స్వార్థత్యాగి శతాబ్దమున కొకఁడుదయించినను మాకీ మాతృవిద్యానిరసనము, బానిసతనము, అన్యమతాచారవికారము లేలకలుగును. పుణ్యపురుషా! నీయశస్సేయశస్సు. నీకీర్తి యాచంద్రతారకమై వెలయునుఁగాక.

# కవివంశవృక్షము.

———:(0):———

ఈతని కాలమున భాషాభివృద్ధి చే గాక కర్ణాటరాజ్యము మహోన్నతదశయందుండెను. } కృష్ణదేవరాయలు (1509—153[illegible])

|

అచ్యుతదేవరాయలు.

|

విశ్వనాథరాయలుకు పాండ్య (మధుర) రాజ్యము నిచ్చెను. ఈతఁడు పాండ్యదేశపురాజగు చొక్కలింగనాయనితో యుద్ధమొనర్చి మడిసినట్లు తెలియుచున్నది.

చెవ్వరాజుకు (చోళ) తంజావూరును కట్నముగా నిచ్చెను. ఈతఁడు అచ్యుతదేవరాయలు తోడియల్లుఁడు.

|

అచ్యుతరాయలు.

|

ఈతని కాలములో తంజావూరురాజ్యము సంపూర్ణాంధ్ర సంగీత సాహిత్యాదివిద్యలయందత్యుత్కృష్ట దశయందుండెను. } (గ్రంథకర్త) రఘునాథరాయలు (6[illegible]–165[illegible])

|

విజయరాఘవరాజు (1674)

ఈగ్రంథంబునందుఁ బ్రథమాశ్వాసంబు మాత్రము కీర్తిశేషులైన పోలవరం జమీందారుగారి సరస్వతీపత్రికలో ముద్రింపఁబడినది. ఆభాగము (శతావధానులు) దివాకర్ల తిరుపతిశాస్త్రులుగారు మాకొసంగిరి. వారికిఁ గృతజ్ఞతావందనంబు లర్పించుచున్నవాఁడ. మిగిలిన యముద్రితగ్రంథము చన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంబునుండి వ్రాయించి తెప్పించితి.

శ్రీ కృష్ణ[illegible]

సుల్తాన బజార్, హైదరాబాద్. ఆం. ప్ర.

## — పీఠికాధారములు —

(1) చేమకూర వేంకటకవి ప్రణీతగ్రంథములు.

(2) కం. వీరేశలింగముగారి కవులచరిత్రము.

(3) వేటూరి ప్రభాకరశాస్త్రులుగారి వ్యాసము. (స్వధర్మప్రకాశిని)

(4) రఘునాథభూపాలుని గ్రంథంబులై యున్నవి.

చిత్రాడ.
28—11—1919.

సంపాదకుఁడు,
చెలికాని లచ్చారావు,
అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము.



# వాల్మీకి చరిత్రము.

---

## ప్రథమాశ్వాసము.

శ్రీవైదేహియురోజపూర్ణకలశీశృంగంబులం బల్లవ
శ్రీవిన్యాసముఁ జూపుహస్తములచేఁ బ్రేమం బ్రకాశంబుగా
శ్రీవిద్యల్ నతకోటి కిచ్చు నలరాజీవాక్షుఁ డిక్ష్వాకువం
శావిఖ్యాతమహార్ఘ్యరత్నము మదీయాభీష్టముల్ సేయుతన్.

సీ. కమలగర్భాండభాండము లఖండజ్యోతి నెనయు బంగరుబొమ్మరిండ్లు గాఁగ
నీరేడులోకంబు లెడనెడఁ జెన్నారు పన్నారుదొంతులబాగు గాఁగ
బ్రహ్మాదిసర్వగీర్వాణసంఘము లెల్ల నాడించుబొమ్మలజాడ గాఁగఁ
బార్వతీభారతీప్రముఖాదిశక్తులు ప్రియమిచ్చు చెలిమికత్తియలు గాఁగఁ
దలఁపున జనకునింట నుదారమహిమఁ, బాలలీలలు సలిపె నేభామ యట్టి
రత్నగర్భయనుంగు గారాపుఁబట్టి, మమ్ముఁ జేపట్టి సుఖలీల మనుచుఁ గాత.

ఉ. ఎక్కడ రామకీర్తన మొకించుకయే వినవైన వేడ్కఁ దా
నక్కడ వచ్చి రంజిలి కృతాంజలి యై ప్రముదాశ్రుపూరముల్
పిక్కటిలంగ మైఁ బులకబృందము జాదుకొనంగఁ బాడుచున్
జొక్కుచునాడు నయ్యనిలసూనుఁ బ్రభానతభానుఁ గొల్చెదన్.

*ఉ. మోదకహస్త హస్తిముఖ మూషకవాహన యేకదంత లం
బోదర తప్తకాంచనసముజ్జ్వలవిగ్రహ బాలచంద్రరే
ఖాధృతమౌళి యంచుఁ దను నచ్చపుభక్తిఁ దలంచువారలన్
మోదముమీఱఁ బ్రోచుగణముఖ్యుని విఘ్నపతిం దలంచెదన్.

చ. హరిణవిలోచనా గిరిజ యాడుదమా యని మోవిపందెమున్
గిరిజకు నిచ్చి యచ్చెలియ కేల్దెమలించుచుఁ జంద్రజూట నీ
పరయఁగ నెంతజూటవని యల్లన పన్నిదమీ మోదంబునన్
సరసములాడు శంకరుఁడు శబ్దవిశేషము లిచ్చుఁ గావుతన్.

---

*ఈపద్యము ప్రబంధమణిభూషణములో నుదహరింపఁబడినది.

ఉ. పరిణయవేళ నాథునికపర్దముపైఁ దలిమించుచున్ తెరుల్
కరముల నించి నించి యొదికంబు వగం దలఁబ్రాలు వోసి యా
హారము లాయి లాలు వో నలి సురాపగ సిగ్గున డగ్గె నంచు లోఁ
బరిహాసనం బొనర్చునలపార్వతి మాకు శుభంబులీవుతన్.

ఉ. పంచినలీల రాగము ప్రపంచితమై చెలఁగన్ విపంచి వా
యించి తను న్నగించి యొలయించిన ప్రేయసి నల్ల చించి మో
దించి ప్రవీణ వౌ దని నుతించి కవుంగిట నుంచి ప్రేమ యా
రించి వరించి మించినవిరించి మముం గరుణించి ప్రోవుతన్.

క. రాణించు నెపుడు నంత, ర్వాణిమనోజ్ఞముల వివిధవాణీకృతి నా
వీణాపుస్తకపాణిని, వాణిని ద్రుహిణముఖరంగవాణిని దలఁతున్.

క. ఆదికవుల వాల్మీకుల, వేదవ్యాసులఁ దలంచి వివిధాగమసం
వేదితఁ గట్టిఁడియగుకవి, తాదక్షవిలాసుఁ గాళిదాసు నుతింతున్.

క. భామహవామనుల రుద్రట, భామహభవభూతిబాణభాసముఖకవి
గ్రామణులం గవితాబ్జిన, భోమణులఁ దలంచి మ్రొక్కి పూజింతు మదిన్.

ఉ. లక్షణలక్ష్యకోటి పదిలంబుగ నేటికవుల్ నుతింప శ్రీ
దక్షమసంస్కృతాంధ్రకవితాపదవిన్ వహి కెక్కి శబ్దవై
చక్షణి మించునన్నని విశారదుఁడై తగుతిక్కయజ్వ ధా
రీక్షణభక్తిశీలుఁ డగునెఱ్ఱయప్రెగ్గడ నేఁ దలంచెదన్.

శా. సందర్భంబు నవార్థగర్భ మగుచుం జాటుక్రియన్ మించఁగాఁ
జందుల్ ద్రొక్కుచు నిండి యంతట రసశ్రీ మెచ్చుగొల్పంగ నా
నందాంభోధితరంగముల్ వలెఁ బ్రబంధంబుల్ భువి నిల్పి దా
నం బెల్లంబుగఁ గీర్తి గాంచి మనుశ్రీనాథున్ మదిం గొల్చెదన్.

చ. తెనుఁగు తెలుంగు సంస్కృతము తీరును గాని యపప్రయోగముల్
పెనచినకబ్బముల్ సభలఁ బెద్దతికంబుగఁ జెచ్చి పెద్దలన్
విసు మన వారు తేరపున వింతలు వింటిమి నేఁ డటంచు న
వ్వినన నుతి యంచు నెంచుకుకవిప్రకరంబుల మెచ్చ నర్హమే.

. యతియుఁ బ్రాసంబు దప్పనియంతమాత్ర, మూనక తప్పును దా మెచ్చికొనదు వానిఁ
జూచి సేతురె రసపరిపాటిఁ జేట, మాటలఁ గవిత్వము ఘటించు నేటికవులు.

*క. చెప్పవలెఁ గప్పురంబులు, కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపై
గుప్పినక్రియ విరిపొట్లము, విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్.

క. చెవులకుఁ జవులై చల్లఁగఁ, గవులకుఁ దవులై సమస్తకావ్యకళాబం
ధువులై రససింధువులై, యవురా యనఁ గవిత లవని నలరఁగ వలదా.

వ. అని యిష్టదేవతాభివాదనంబును బురాతనాధునాతనసుకవిగుణానుమోదనంబును గుకవికురవాంకృతిభేదనంబును సదసత్కవిత్వతత్త్వానువాదనంబును గావించి యే నొక్క కావ్యంబు నవ్యోద్యమవ్యర్థచమత్కారభవ్యంబును సకలవిద్వత్కవిశ్రావ్యంబునుంగాఁ జేయ నూహించియున్నచో నొక్కనాఁడు.

సీ. మెఱుపుపచ్చనికట్టె మొఱపుగాఁ గటిఁ గట్టి యపరంజిపిడి పిడియంబుఁ జెక్కి
కట్టెవిల్లొకచేతఁ బట్టి వేఱొకచేతఁ గోలమించులకోరికోలఁ బూని
రాణించుగొప్పసుప్పాణిముంటులఁ దాల్చి తరమైనబలుకెంపుతాళి వైచి
మణికిరీటము డంబు మఱపించు నొకవింతలాగియౌ శోనికుళ్ళాయి వెట్టి
యొక్కచక్కనిజవరాలు ప్రక్కఁ బిన్న, వయసు రాకొమరుఁడు నిరువంకఁ గొలువ
వెడఁదకన్నులవాఁ డొకపుడమిఱేఁడు, నేఁడు నినుఁ బ్రోతు ననిచాల నిలిచె మ్రోల.

క. నిలిచిన నేనును వంగను, పులకించుచు నుండ నాత్మఁ బొంగుచు నతనిం
గలలోనఁ గనుఁగొని నా, కులదైవం బైనయలరఘుపతియె యనుమన్.

గీ. మేను పులకింపఁగాఁ బ్రణమిల్లి నిలిచి, యున్ననను జూచి యప్పురుషోత్తముండు
మందహాసాంచితముఖారవిందుఁ డగుచు, వత్స రమ్మని వత్సలత్వమునఁ బలికె.

ఉ. నీకవితావిలాసము గణింప సుధారసధారకంటె నిం
పై కనిపించు దానఁ గృతియైనను మిక్కిలిసొంపు నింపదే
(*)నాకథఁ దొల్లి యర్థరచనారుచి మించఁగఁ జెప్పె తక్కె వా
ల్మీకిచరిత్రముల్ నొసవు మెచ్చగ నీ విపు డచ్యుతాత్మజా.

క. పావనరమణీయం బగు, నావాల్మీకులచరిత్ర వాది కృపసేయన్.
తీవి మెఱయు నీపుణ్య, ప్రావీణ్యమ యచ్యుతేంద్రరఘునాథనృపా.

---

*ఈపద్యము లక్షణదీపికలో నుదాహరింపఁబడినది.

(*) ఇతఁడు రామాయణ మనుకృతి నతిమనోహరముగా నవార్థగర్భముగా రచించియున్నాఁడు. దానినే మధురవాణి యనువేశ్యాతిలకము సంస్కృతమున ననువాదము చేసెను. దీనిలో బాలకాండమున నే 3000 పద్యములు గలవు.

క. అని యానతిచ్చి చనఁ బే, ల్కొని యే నెంతటియనంతకరుణాఢ్యుఁడవే
యని యారఘువల్లభునిన్, వినుతించి ప్రభాతవేళ వేడుక మెఱయన్.

వ. కొలువు కూటంబునకుం జేతెంచి విబుధోత్తములకుం జెప్పిన వారు నిది శోభనస్వప్నం బపారకరుణాసముద్రుం డగు రామభద్రుండు నీనిజభక్తికి మెచ్చి కృతి సేయు మని యానతిచ్చెం గావున నీకవితావిశేషంబు సకలలోకప్రసిద్ధం బగు నని సంతసించి పలికిన నేనును వాల్మీకిచరిత్రంబు సేయ సమకట్టి తత్ప్రసాదలబ్ధం బగు కవిత్వంబు తదధీనంబుగాఁ జేయుట యుచితం బని విచారించి యద్దేవతాసార్వభౌమునకును.

క. బర్హిణకంఠచ్ఛాయున, కర్హాణచణకాయునకు జగద్గేయునకున్
బర్హిర్ముఖముకుటీఘటి, తార్హణచరణునకు ఘనకృపాభరణునకున్.

క. రక్షోవక్షోఽన్యగ్రస, కుక్షింభర నిశితసాయకునకున్ మిథిలా
ధ్యక్షసుతానాయకునకుఁ, బ్రత్యక్షస్తుతనామునకు దయాధామునకున్.

క. భీషణఘోషణజలనిధి, శోషణశరధారునకు నసూయామాయా
ద్వేషణభాషణఖరఖర, దూషణపేషణపటిష్ఠదోస్సారునకున్.

క. వైదేహీమిత్రునకున్, సాధితశత్రునకు సప్తసాలమహీరు
డ్భేదనపటుశరునకు హర, కోదండవిఖండనావికుంఠకరునకున్.

క. మార్తాండవంశపావన, మూర్తికి నవహారచంద్రమోహారలస
త్కీర్తికి మానిమనోంత, ర్వర్తిశుభాకారునకును రఘువీరునకున్.

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన వాల్మీకిచరిత్రం బను ప్రబంధరత్నంబునకుం
గథాసూత్రం బెట్టి దనిన.

క. శ్రీవరచరణాంభోజర, జోవాసితమగుచు నలరు సుకృతినికరసం
జీవనము పావనము బద, రీవనము విముక్తిసుందరీయౌవనమై.

సీ. నరుఁడుం దానును గ్రీడ సల్పు నెపుడున్ నారాయణుం డవ్వనిన్
వరమాన్యప్రజయాగభాగముల నాస్వాదించుచున్ మంత్రవా
క్పరిపూతాహుతిధూమగంధముల నాఘ్రాణించుచుం శ్రోత్రభా
సురదిగ్గామగసామగానములు వించున్ నిత్యసంతుష్టుఁడై.

ఒక్కనాఁడైనను జక్కఁగాఁ గనువిచ్చి తెలుపుఁజూపులఁ జూచు ప్రేమ లేక
వేడుకకైనను వెకలివవ్వులు మీఱ నటనఁ జూపట్టఁ బల్కుటయు లేక
యబుసుఁబోకకునైన మల్లంబు చల్లఁగా గందం బలందెకు పొందు లేక
నెలకైనఁ గొంతయాఁకలి దీఱఁ గలమాన్నకబళ మొక్కటి జిహ్వకిడియు లేక

నలఁగి యొండల నెండి వానలను దడిసి, మోహ మనుత్రోవ యెఱుఁగక దేహమాత్ర
ధారులైనట్టి యచ్చటి తపసులెపుడు, వలవ జేయుదు రల ముక్తిలలనఁ గోరి.

చ. శమనము లైన యమ్మునులశాసన మెట్టిదో గాని కాననం
దమితమయి ప్పఁ బచ్చికలు ద్రచ్చి వెసం జను హోమధేను సం
ఘములకు గోపబాలకులకై పడి నేరిమి వాలవాలదం
డముల నదల్చి తెచ్చు మగుడంబులు లచ్చట నిల్చి మచ్చికన్.

ఉ. బాలరసాలసాలముఖపాదపరాజికిఁ బూని మౌనిరా
డ్బాలికలందు సైకతఘటంబులచే సలిలంబు వోయఁగాఁ
గాలువ దీర్పఁ దిన్నఁగ నఖంబున మన్నులు గీఁకి యా
వాలములందు నెక్కొనఁగఁ బ్లవంగమసంఘము లేమి చెప్పఁగన్.

మ. తుహినాహార్యగుహాగృహోదరసరిత్పూరంబు లుద్యత్పులిం
దహతక్రోడవిభిన్నఘోణభసముత్థాపాలికల్ దెచ్చి త
న్మహి నిండింపఁగ మౌనికన్యకలు ప్రేమన్ రేఁగుఁబం డ్లొలుచన్
రహిమైఁ గూడంగ నేరి తా రోషుల నిండం నింతు రెంతే తమిన్.

గీ. గజము లుటజాంగణంబులఁ గరములఁ గొని, దినము నివ్వరి*యన్నలు దెచ్చివైవ
నవి కపులు గోళ్ల నొలిచి బియ్యంబు సేయు, మునులనావిరన్నవేళకు ననువుగాఁగ.

క. గంభీరహ్రదములలోఁ, నంభస్సులు ముంచి యిచ్చు హస్తంబులచేఁ
గుంభీంద్రమ్ములు మునికుల, కుంభిగణ లోనఁగునీరుకుండలనిండన్.

కం. నారాయణుండు సాక్షా, త్కారంబున నతిథివోలెఁ గ్రతుభాగంబుల్
కోరికఁ గయికొనునఁట యట, నారయఁ దన్మునులభాగ్యములవియె పొగడన్.

గీ. అవ్వనంబున శౌనకాద్యఖిలమునులు, మునులఁ బుణ్యవివర్తాపఘనులఁ గూడి
హరికథామృతలహరి నందందచాల, నోలలాడుచు నుండెడువేళయందు.

సీ. నారాయణునిదివ్యనామావళులు పల్కుమహతిఁ దామూఁపున రహిఁ వహింపఁ
బవడంపుఁ జనుఁ గెంపుఁ బగటు కెంజెడగుంపు జిగియాకసపుఁ జెట్టుఁ జిగురుఁ గేలుపఁ
గేల్దమ్మిఁ బొడమువా క్తికపంక్తి యనవస్ఫటికాక్షసరము నంభ్రమముఁ జూపఁ
బ్రతిదినస్నానసంగత మైనగంగాంబుపాండిమం బనఁ దనుప్రభ నెలంగ

*"అన్న" అనుటకు "అవియఁదో చినయట్టియన్నతోడ" క్రీడాభిరామము. 173

విష్ణుభక్తులై ఘనులు భావింప ననుచు, బిసరుహాసనో యనఁ గుంచె కరమునందు
నమరఁగా నంత నంతరిక్షమున వచ్చె, నారదుఁడు తత్త్వబోధవిశారదుండు.

క. వచ్చిన నమ్మును లెల్లను, హెచ్చినతమితోడ నతని కెదురేగి వెసం
దెచ్చి యతి కర్ఘ్యపాద్యము, లిచ్చి యుచితపీఠి నుంచ నెలమినతండున్

సీ. శౌనకా సుఖమె విశ్వామిత్ర లెస్సలా కణ్వ మంచిదియె భార్గవశుభంబె
సుతపరిణామంబె సుతప సంతోషంబె చ్యవనసేమమె పరాశరశివంబె
కపిల మంగళమె మార్కండేయ కుశలమే వత్స సౌఖ్యమె కాత్య యుత్సవంబె
మాండవ్యభవ్యమే మైత్రేయ భద్రంబె సుబలమేలె వశిష్ఠ శోభనంబె
క్రతుభరద్వాజగౌతమకశ్యపాత్రి, కలశసంభవకౌండిన్యగర్గమంద
పాలజాబాలిరోమశప్రముఖులార, యీర లానందముగ నున్నవారె యిచట.

క. అనుచుం గుశలప్రశ్నం, బొనరించిన మౌను లెల్ల నుల్లము లలరం
వినుతు లొనరించి సురముని, కని రిట్టులు వినయము నయంబును బెరయన్.

క. నారద బ్రహ్మజ్ఞానవి, శారదశారదపయోదసన్నిభదేహా
సారదయానిజతేజో, దూరదళితదురితభయ చతుర్ముఖతనయా.

క. బహుళబ్రహ్మాండంబుల, బహిరంతర్గతము లగుప్రపంచంబులయం
దవారహత విశృంఖలగతి, మహిమఁ జరింపుదువుగాదె మహితవిచారా.

క. కావున నీవిశ్వమునం, దీవెఱుఁగనికథలు లేవు ఋషికులతిలకా
భావించి చెవులు చల్లఁగ, శ్రీవిష్ణుస్మరణకథ వచింపుము మాకున్.

చ. అని యిటు లామునిప్రవరు లందఱు మోదము నిక్క నొక్కతీ
రున సురమునిస్మరస్మరణరూపకథాశ్రవణానుషంగులై
వినుతి యొనర్ప నాతఁ డతివిస్మయవిస్మయమానసస్థుఁడై
వనజదళాక్షు భక్తజనవత్సలు నెమ్మదిలోఁ దలంచుచున్.

చ. పులకలు మేన జాదుకొనఁ బొంగుచు మాటికి హర్షబాష్పముల్
జలజలఁజిందఁగా హరితలంపునఁ జిందులుద్రొక్కఁ గొంతసే
పలయిక వోలె మేమఱచి యంతటఁ గన్నులు విచ్చి చూచె మా
ను లడిగినట్లు యర్థము మనోగతమ్మాటకు నిచ్చ మెచ్చుచున్.

క. మునులార మీర లొనరిం, చిన యీప్రశ్నము పురాణసిద్ధము శుద్ధం
బనఘ మఘౌఘంబు శుభం, బనితరజనసులభ మైతిహాసిక మరయన్.

వ. అని పలికి తత్సమీపంబునఁ బర్వతుం జూపి యిలంతు మత్సఖుం డితనికి విష్ణు

ఘోరరహస్యంబులు కరతలామలకంబుగాఁ దెలియ విందు నేనిదె రమావల్లభుసేవ
కుం బోయి వచ్చెద నని వారల వీడుకొని నారదుం డరిగిన యనంతరంబ, శౌనకాదు
లత్యంతహర్షంబున నప్పర్వతమహర్షిం జూచి నారాయణస్మరణమహిమానుభావంబు
వివరింపు మని యడుగుటయు నప్పర్వతుం డి ట్లని చెప్పందొడంగె.

గీ. మౌనులార నారాయణస్మరణమహిమ, హిమకరకళాధరుం డొకయించుకంత
యెఱుఁగు నని విందుమదియును నెఱుఁగలేరు, బ్రహ్మాదిక్పాలసురమునిప్రవరులెందు.

గీ. పరమమునులార శ్రీహరిస్మరణరూప, కథ యనఁగ నామకీర్తన కథయ నామ
కీర్తనము సేయఁ జేయఁ దన్మూర్తి యెల్ల, యుల్లమునఁ జాడఁజాడ రంజిల్లఁగాన.

ఉ. శ్రీహరినామకీర్తన మశేషభవప్రభవాతిమోహసం
దోహవికర్తనం బని శ్రుతుల్ మొఱవెట్టఁగ వించు నెండె సం
దేహముపోఁక మూఢులగతిం బెడఁబాతురు కర్మవార్ధులం
దోహరిసాహరిన్ మునిఁగి యొల్లరు దీని ప్రచింతి యేమనన్.

లయ. క్షేమము శ్రుతిప్రకరసీమము సమస్తగుణధామము నిశాటకులభీమము మునీంద్ర
ప్రేమము మహామునిలలామము తమోభరవిరామము నతాళికరహేమము సదర్థి
స్తోమము మఖాభినవధామము విశిష్టతరహేమము కృతప్రమదభూమము శుభార్థో
ద్దామము లసద్గతికి దీమము శివాదృతవినామము రమాధిపతినామము దలంపన్.

క. ఈహరినామరహస్యం, బూహింపఁగ నర్థవాదయుక్తులచే సం
దేహించు విష్ణుమార్గ, ద్రోహులకుం దెలుపవలవదు పరాకైనన్.

క. పరనిందకుల కసూయా, పరులకు శ్రుతివిహితకర్మపరిహారులకున్
హరిచరణభక్తిరహితాం, తరంగులకు నిది వచింపఁదగ దండ్రు బుధుల్

క. పాషండుల కాగమపర, దూషకులకు నాస్తికులకు దుష్కృతమార్గా
న్వేషకులకు నిది చెప్పిన, దోషము గల దనుచుఁ జెప్పుదురు బుధులెల్లన్.

క. ఎవ్వరు విశుద్ధమానసు, లెవ్వ రఖిలజీవభావహితమతి మనువా
రెవ్వరు సత్యవ్రతపరు, లవ్వారపుణ్యులకు దీని నర్హము వినఁగన్.

వ. మునులార మీర లందఱు గోవిందచరణారవిందవందనపరాయణులు నతినిశితధీషణా
రథారాఖండితగ్రంథులు మార్ధ్వమంథులు సాత్త్వికులుం దాత్త్వికులుం గావున మీకు
నీహరినామకీర్తనమహాత్త్వం బెఱింగిన మాత్రకు వివరించెద నేతత్ప్రకాశకం బైన
యొక్క యితిహాసంబు గలదు సావధానమతులై వినుం డని యిట్లని చెప్పందొడంగె.

సీ. శ్రీకిఁ బుట్టినయిల్లు చింతామణికి గని యంబుజాక్షునకు శయ్యాగృహంబు

కల్పకవనవాటికలకు నావాలంబు పాకారిముఖులకుఁ బాకభూమి
కామధేనువులకు గోష్ఠీనమంబు దనివహంబునకునుఁ బానీయశాల
విశ్వంభరాదేవి వెలిపట్టుపుట్టంబు నెలతాల్పువేల్పున కలరుఁదోఁట
సలిలపతిబొక్కసము నదీసతులకెల్ల, నర్మసీమంబు గిరులకు వర్మ మనల
తాండవితపాండుడిండీరఖండధాళ, ధళ్యసాంద్రంబు పాలసంద్రంబు మించు.

క. ధళధళన మించునందుం, గలితసుధాఫేనపిండఖండంబులు శ్రీ
లలనామణియాటల కై, యెలమి నునుపు పెంపుబొమ్మరిండ్లు లసంగన్.

శా. ఏయేచోటుల నిచ్చ యానచటనే యీనాదుమైపాన్పుపై
శ్రీమాపాపతి యుండుఁగాక యనుచున్ శేషాహి దానంతటం
గాయవ్యూహము వన్నెనో యనఁగ శంఖశ్రేణి పాణింధమ
చ్ఛాయాచ్ఛాదితరీతి నందలరుఁ జంచల్లోలకల్లోలముల్.

ఉ. ప్రాలి జలంబుఁ గ్రోలుఘనవారిదపంక్తులలోఁ దళుక్కునం
గ్రాలు మెఱుంగుఁదీగియలు గన్గొన నొప్పుచునుండు నందునె
క్కాలము వీచిగర్భములఁ గ్రమ్మఁ గ్రమ్మఁ బుట్టు నప్సర
స్త్రీలన నెల్లచో ననధరీణధురీణవిలాసమూర్తులై.

చ. ఘనబడబాగ్నికీలములఁ గ్రాఁగి యభంగతరంగకైతవం
బున వెస నింగివెన్నొరయుఁ బొంగి చెలంగుఁ బయఃప్రపూరముల్
దినదినమున్ సమాగతనదీజలయుక్తి నడంగు నంచ కా
క నిమిషమట్టు లున్నను జగంబుల నొక్కట నాక్రమించదే.

ఉ. పన్నగశాయి నాభిసితపంకరుహోపరిభాగపీఠిమై
నున్న చతుర్ముఖుండు బలె నుండుద మంచుఁ దలంచి యందుఁ దా
రున్నతఫేనకూటముల నోహరిసాహరి నెక్కి తేలుచుం
జన్న పయోధరార్భకుల సారెనగున్ వరుణావరోధముల్.

క. ఆపాలకడలినడుమం, దీపించుం జగదఖండదీపముఁ దేజో
రూపంబు నగుచు శ్వేత, ద్వీపము నానావిధోపధిదురాపంబై.

క. జ్వలదౌర్వానలశిఖలం, గలశపయోరాశి గ్రాఁగఁగా నట నడుమం
దలముగఁ బోసిన మీఁగడ, వలెఁ దెల్లనిదీవి తీవిఁ బరఁగుచునుండున్.

సీ. తరిఁగొండచేఁ ద్రచ్చుతఱిఁ దేలి యొక్కెడిక్కునఁ జేరు నవనీతకూట మనఁగ
మథనపరిశ్రాంతి మైఁ జుట్టుచుట్టిన వాసుకి ఘనభోగవలయ మనఁగ,

దరఁగల నానాఁటఁ దఱచుగా నొక్కెడఁ బెట్టిన ముత్తెంపుఁ బెట్టువనఁగ
జలనిధిరాజు వక్షస్థలంబునఁ జాలఁ బసమీఱు వజ్రంపుఁ బతక మనఁగ
నీరనిధికన్యకామణి నీడచూడ, నచట నిల్పిననిద్దంపుటద్ద మనఁగ
ధవళకాంతిప్రలిప్తదిగ్దేశక మగుచుఁ, దేజరిలుచుండుఁ దగఁ జీవిఁ దెల్లదీవి.

ఉ. ఆ తెలిదీవి ఠీవి మెఱయన్ రయమొప్పఁ దరంగమాలికా
నీతము లైనముత్తెములు నిచ్చలుఁ బైపయి నాను ముక్తికం
జాతవశాయతాక్షి ఘనసంభ్రమ మొప్ప ముముక్షుమాళికైఁ
*చేతనఁ బ్రాలు వోయుగతి శీతసమీరసమీరితంబులై.

వ. అందు.

సీ. శ్రీభామినీశావిచిత్రపాదన్యాసధన్యాయమానసౌధవ్రజంబు
సప్తసమస్వరోచ్చారణజ్ఞమనోజ్ఞకీరశారీశాలికేలివనము
రథ్యాసహస్రతోరణబద్ధకల్పకప్రసవజాలసుగంధబంధురంబు
రవిసుధాంశూపాధిరహితనిత్యోజ్జ్వలస్వజతేజోభరభ్రాజితంబు
జటులకరవకప్రచండప్రచండశక్రి, కుముదకుముదాక్షగణపతిప్రముఖబాహా
దండపాలితమణిగణదండరుచిర, గోపురము మీఱుచుండు వైకుంఠపురము.

క. శ్రీరమణనాభికుహరస, రోరుహసద్గంధలహరి రోసి చరించున్
సారెకు నచ్చట శిశిరస, మీరము లఘులైకసుఖముమీఱఁగ నెపుడున్.

సీ. శ్రీవత్సకౌస్తుభశ్రీలఁ బూననివారుఁ గుడుసుఁగైదువలు సేకొననివారు
ఘనఘనాఘననిభాంగముల మించనివారు పసిఁడిదుప్పటులఁ జొప్పడనివారు
జలజసంపకశార్ఙ్గములఁ ధరింపనివారు నడుగులమిన్నులు నిడనివారుఁ
గమనీయభుజచతుష్కంబుఁ దాల్పనివారుఁ బులుఁగుగొల్లని నెక్కి పోనివారు
వెడఁదకన్నులఁ గృప యుట్టిపడఁగ నెపుడు, భక్తసంతతిఁ బ్రోవఁ బాల్పడనివారు
లేరు వెదకిన నచ్చోటి సారసాక్ష, సారసారూప్యములుగన్నవార కాని.

---

*"చేతనఁ బ్రాలు" అనుటకు :—

కలయం గాఢ్పనఁ దూలి పుష్పాడి దివిం గప్పారు మారుండు వే
డ్కల నారామరమావసంతులఁ గడంకం బెండ్లి సేయించుచో
వెలయంబట్టిన యుల్లభంబు పగిదిన్ వేమాఱుఁ దద్భూమిపైఁ
జెలువొందించుచు రాలుఁ బుష్పవితతుల్ చేతన్ బ్రాలో యనన్.

విన్నకోట పెద్దన ప్రద్యుమ్న చరిత్రము.

క. అందు ముకుందుఁడు మణిమయ, మందిరమున నుండుఁగోటిమన్మథశోభా
కందళితరూపరేఖా, సుందరుఁడై రమయుఁ దాను సుఖతరలీలన్.

క. శ్రీతరుణీపతిఁ జూడఁగ, నా తెలిదీవికిని దీర్ఘయాత్రాపరులై
యేతెంచిరి సత్పురుషులు, నాతతహర్షులయి లీల నట యొకవేళన్.

క. ఏతెంచి యచటి మహిమలు, చేతోమోదంబు లుల్లసిలఁ గనుఁగొనుచున్
నూతనమణిఘృణిజాత, ప్రోతం బగుహరిహజారముం జొచ్చితగన్.

మ. సరసీజాసనవాసవాదిసుమనస్సంఘంబు సన్మౌనులున్
సారిదిన్ మీఱెడుచావడుల్ గడచి మెచ్చుల్ వచ్చు గంధర్వకి
న్నరగానంబుల తానమానముల నానందంబు నొందించుచుం
దిరమౌ నొక్కవిలాసమందిరము గాన్పించంగ నీక్షించుచున్.

క. లోపలఁ జనిచని హరినీ, లోపలకురువిందకందళోజ్జ్వల *కనకా
లోపలసద్రచనాజా, లోపలలితమైన యొక్కయున్నతవేదిన్.

సీ. కౌస్తుభమణిఁగన్న కనకంపుబొమ్మనా వనధికన్యక యురంబునఁ జెలంగ
విమలాదికాంతలు వెన్కఁ గంకణనిక్వణము మించ వింజామరములు వీవ
నిలయు నీళయుఁ బాదనళినముల్ గుబ్బచన్బటువులఁ జేర్చి యందముగ నొత్తఁ
దెలిదమ్మిరేకుల తేటఁజూపఁగఁ జాలు వాలుగన్నులఁ గృపఁ బ్రేలుచుండ
మాటికిని శేషనిశ్వాసమారుతములఁ, గుందనపుఁ జేలచెఱఁగు లందందకలయ
మృదులతరభోగభాగంబుమీఁదఁ బవ్వళించి చిఱునవ్వు చెక్కుల నించువాని.

సీ. మకరతశ్యామకోమలవిగ్రహమువాని మకరకుండలదీప్తిమహిమవాని
మకరాంకకోటిజిన్మధురరూపమువాని మకరాకరోరుసద్మంబువాని
మకరభిచ్చక్రభీమకరాంబుజమువాని మకరార్కదుస్సహామహమువాని
మకరందనిష్యందమానితోక్తులవాని మకరాదివేయినామములవాని
మకరతోరణరుచిహారనికరసంభ్రమ, మకరభుజమధ్యగృహరమామహితముఖహి
మకరసదృగుద్భటజ్వలత్ప్రకృతివాని, నిందిరాపతిఁ జూచి యానంద మొంది.

గీ. మేనులెంతయుఁ బులకింప మౌను లపుడు, వినయభయభక్తిసంభ్రమాన్వితమనస్కు
లగుచు దండప్రణామంబు లాచరించి నిలిచియిట్లని పొగడి రన్నీలవర్ణు.

దండకము. శ్రీభామినీ భూమి నీళా కుచాభోగభాగాతి భాస్వద్భుజామధ్యమధ్యందినా
ర్కార్చిరాధిక్యధిక్కార్యవేలప్రభాజాలజాలంధరోద్యాణ బంధానుసంధాన సంభేద

*కనకాలోప = బంగారులోపములేనిది.

సానందికర్మందిహృన్మందిరోద్యన్నిధిధ్యానసావాసనామూలకందా నమద్భక్తపా
లీముకుందా ముకుందా సదానంద గోవింద బృందారకశ్రేణిమాణిక్యకోటీరకోటీరుచి
స్నిగ్ధముగ్ధాంఘ్రిపంకేరుహోద్భాసమానా సమానాధికత్వస్థితిం బాయునీమాయచం
దంబు డెందంబునన్ యోగిబృందంబు గానంగలే రన్న చోద్యంబు లింకేటికిం బు
జ్జవం బొప్పఁగాబొజ్జలోనొక్కపజ్జం జగజ్జాలముల్ మాటి యొక్కొక్కమాఱు బ్బు
మున్నిటిలోఁ జిన్నిపాపండవై యుండియున్ వెండియున్ హేమగర్భాండభాండం
బు లొండొండ నీరోమకూపంబులం దండతండంబులై కందుకంబుల్ వలె న్నిండి
యాడన్ విరాడ్రూపముం జెట్టియుం జోటివై వారిరాశిం ద్రయీచోరకుం జీరి
యున్ మేటితామేటివై మూఁపునన్మందరగ్రావమున్ మోచియున్ ఘోణివై కో
ష్ణునం బూనియాక్షోణిరక్షించి మాయాతిదైత్యున్ హిరణ్యాక్షుఁ శిక్షించియున్ సా
మిహార్యక్షమై నీపదాపేక్షమై యున్న ప్రహ్లాదు సాహ్లాదముం బాపు దుష్ప్రపు
నానాదురాలాపు ముమ్మాఱుపుదగ్రాయసోగ్రాతిజాగ్రన్నఖాగ్రంబులం జించియుం
బొట్టివై మెట్టి వైరోచనిం గిట్టియుం భార్గవాకారముం బూని దోర్గర్వఖ్యాతి సంప
ర్గణోద్దంతడన్ రాచతండంబులం గండ్రిగొడ్డంట మొయ్యేడుమాఱుల్ వడిం జెండి
యున్ రామరూపంబునన్ నిల్చి నీపాదసేవల్ ప్రసాదింపు మోదేవతాసార్వభౌమా
పవిత్రైకనామా ఘనశ్యామ శ్రీరామ హాస్తీకృతశ్రీ విహాస్తేంద్రవైరీ నమస్తే హితా
ర్థప్రదానా నమస్తే నమస్తే నమస్తే యటంచు న్నుతింపన్.

క. అమ్మునుల నుతిరవమ్ముల, నెమ్మనమలరంగ నపుడు నీరజనాభుం
డమ్మణిమయమందిరమున, ధ్యమ్మున నున్నట్లయుండి యాశ్చర్యముగన్.

సీ. బాలాతపము నింగిపైఁ బర్వ్వగతిఁ గటి విలుగట్టువన్నియౌవలువ వెలయ
దృక్కోణకరుణాబ్ధి కెదురెక్కుమకరయుగళమన మకరకుండలము లలర
గళశంఖమునను జొక్కపుముత్తియంబుల లీల నక్షత్రమాలిక చెలంగఁ
బాణిపద్మంబుల రాణించు నాళంబులనఁగఁ గోదండసాయకము లుండ
మదివెడలి నిల్చుచంద్రబింబంబనంగ, నురమునందునఁ గౌస్తుభము మెఱుపు నెఱపఁ
బచ్చరామానికపుజిగిపగ టనంగ, నమరవారలమ్రోలఁ బ్రత్యక్షమయ్యె.

క. ప్రత్యక్షంబై కనుఁగొని, ప్రత్యక్షరవిలసదమృతరసయుక్తములౌ
నత్యంతసుమధురోక్తుల, నృత్యన్మణికుండలుండయి దయం బలికెన్.

గీ. పరమపావనమైన మీపారమార్థి, కస్తుతికి నిచ్చ మెచ్చితిఁ గలశజలధి
యందుబలె నేను మీమానసాంతరమున, నెప్పుడు వసియింతుఁజనుఁడు మునీంద్రులార!

గీ. అనుచు వారి పల్కుటయు విని మునివతంసు, లద్భుతోత్కర్షహర్షాబ్ధి యందుఁ దేలి
యింతకరుణాంతరంగుఁడవే యటంచు, మఱియుమఱియును బ్రమొక్కి రమ్మాధవునకు.

వ. ఇవ్విధంబున నమ్మహర్షులు సహాసహర్షు లగుచు నకారణకరుణాపరాయణుం డగు నారాయణు సేవించి తన్మూర్తి భావించుచు నప్పాలకడలి వెడలి తత్పయోనిధానసుధాతరంగ ఘటఘటాయిత వర్ధిష్ణుగగనతిరస్స్ఫూర్తి వేలావనమాలాప్రసవజాలతోలలోలంబకప్రాలంబానుబంధిమందరగంధవహడింభసంభ్రమవిలాసపచేళిమసన్యలోకం బగుశాకద్వీపంబునకు వచ్చి యచ్చట నిశాట నోరుశృంగ బలభద్ర శతకేసర దేవపాలంబు లను పుణ్యశైలంబులు మెట్టి యందులం బుట్టి ప్రవహించు ననఘయు నాయుర్దయు సరోంతియుఁ బంచపదియు సహస్రద్యుతియు నిర్జరద్యుతియు ననునిమ్నగలఁ దానంబులు గావించి దధిమండల సముద్దండ గండశావళి హిండనోచ్చాలితఖండ శీకరషండతాండవగగనపుండరీకభ్రాంతసంబోధి యగు దధిమహాంభోధి యుత్తరించి పంచాక్షరీప్రపంచిత పంచవదనసాక్షాత్కార నిర్వంచన పంచజనోదంచితం బగు క్రౌంచద్వీపంబునకు డిగి తదభ్యంతరంబున వర్ధమానోపబర్హణ నందోపనందన సర్వతోభద్రాది సీమభూమిధరంబులు దర్శించుచుఁ దత్పార్శ్వంబుల నభయయు నమృతౌఘయు నార్యకయుఁ దీర్థవతియు ననునదులనాడి యనంతరంబ నిరంతరాజ్యరసచ్ఛురణ పిచ్ఛిలకుక్షిగతకులక్షితిధరాగ్ర లగ్నమహీరుహఫలగ్రహణ మోహారోహి ముహుర్ముహుశ్చ్యవమాన జలమానవడింభ సంరంభావలోకనకుతూహల పరివాహద్వరుణపుర తరుణీవారపూరితోభయపారం బగుఘృతాకూపారంబు దాఁటి యంబరచుంబి కుశస్తంభాగ్ర జాగ్రత్ప్రత కరపత్రనిర్భిన్న జలధరగర్భగళిత నిస్తులస్థూలముక్తాఫల కలితనిజాండ సందోహ సందేహకృతానుధావన వనతామ్రచూడ క్రమతరనమ్రకంధరస్వరామ్రేడిత వివిధపతత్రిరథజాల కోలాహల శాంతప్రాంతకాంతారదురాపం బగుకుశద్వీపంబున కేతెంచి తదంతరంబున మందరగిరికందరామందిరుం డగునిందుశేఖరు సేవించి యాచెంగటం జతుశ్శృంగకపిల చిత్రకూటద్రవిణాదిధరణిధరంబు లవలోకించుచు రసకుల్యయు మిత్రవిందయు శ్రుతివిందయు వేదగర్భయు ఘృతాచ్యుతయు మంత్రమూలయు నాదిగాఁగల మహానదులం గ్రుంకి మునంబుగఁదుఁగ మదిరాప్రద్యోన్మత్తచిత్తపరస్పరస్పర్ధారంభ శుంభదంభోమహిషనిష్ఠురశిరోఘట్టనత్రుటిత పరుషపాషాణకఠినవిషమవిషాణకోణ శకలశ్రేణీపాణింధమసమయసముత్పతదుల్లుఠజ్జఠరజరఠపాఠీనపటలచటులప్రభా ధగద్ధగితదిశావారం బగుసురాపారావారంబు నుల్లంఘించి పల్మలుం బొగడుచు శాల్మలీగుల్మలీనపరిణతఫ

లవిశీర్ణ పలాయమానస్థూలతరతూలఖండపాండరాభ్రవిభ్రమాపాదితశరత్సమయోత్సవాలోకనవిజయయాత్రారంభి తత్రత్యకుంభినీధవబంధుర దుందుభిధ్వాన సంబోధితద్రోణక్షోణీధరగుహాకుహరనిద్రాణకంఠీరవకంఠరవస్తంభితారికుంభికోపం బగు శాల్మలిద్వీపంబున కవతరించి యాసరన స్వరసశతశృంగ వామదేవకుందముకుందపుష్పవర్షాదిమేదినీధరంబులు దర్శించుచు నాదండ నుద్దండపాపచ్ఛటాచ్ఛేదనంబులు సేయు ననుమతియు సినీవాలియు సరస్వతియు రజనియు రాకయు నందయు ననఘతరంగిణుల మునింగి యుప్పొంగి నుతియించుచు నిరంతరమధురమధుర సాసారసవృద్ధివివృద్ధతరభోగజడభావసంపర్కాపనోదనశర్కరాప్రియాత సంతతవ్యావర్తనచరజ్జరదజగరనికరభూరిపూత్కారజాతవాతోద్ధూతభూధరవ్రాతకందళితకందుకఖేలనాచరితఖేచరాక్షీమోదంబగు నిక్షూదంబుఁ గడచి నడచి బంధురస్కంధపటలవటజ్జటాచ్ఛటాచ్ఛాదితదిఙ్మండలాఖండితాఖండ తాండవఖండపరశురేఖావిడంబనడంబరాభ్రంలిహమహోలక్షితహిరణ్మయప్లక్షం బగు ప్లక్షద్వీపంబునకువచ్చి యచ్చోటమణికూటవజ్రకూటజ్యోతిష్మతీంద్రసేనసువర్ణహిరణ్యష్ఠీవమేఘమాలంబులను సేతుశైలంబులు చూచి యరుణోదయు నాంగిరసయు సుప్రభాతయు సత్యంభరయు ననునదులం దీర్థంబులాడి యవ్వలం గడలిమవ్యత్తిమితిమింగల ఘులీగాఢసలిలోపరిపరిఘ్రాకమానజరఠగూఢపాత్రప్రేరితా పూర్వమధ్యస్థలస్థూలతరతరంగసంగనిర్ణిద్రం బగు లవణసముద్రంబతిక్రమించి మహామేరుక్షోణీధర దక్షిణతటలక్షితజంబూవృక్షగళదసదృక్షఫలప్రవాహమరుత్తరంగిణీ పంకాయమానాకలంకజాంబూనదసంపాదితాగణ్యపుణ్యస్వరూపం బగు జంబూద్వీపంబుం బ్రవేశించి యంత.

సీ. మలయశైలనితంబవలయచందనలతానిలయవైభవము వర్ణించుకొనుచు
సంగళప్రస్థాభ్రరంగలగ్నమనోజ్ఞశృంగలక్షణము వీక్షించికొనుచు
మైనాకవివిధప్రసూనవారానూననానాకటకకాననములు గనుచుఁ
పల్లకాచలసరోపల్లకామోదసంవేల్లితానిలము సేవించుకొనుచుఁ
గుతుకముప్పొంగ మతియుం ద్రికూటచిత్ర, కూటమణికూటవృషభకామభమహేంద్ర
వారిధారేంద్రకీలపర్వతములెల్ల, మెట్టి తత్పుణ్యభూములు చుట్టిచూచి.

క. చనిచని కాంచిరి విద్రుమ, వనరాగద్విగుణితాంబువర్ణము చేతం
గనవొప్పు తామ్రపర్ణిన్, వననిధివరవర్ణినిన్ సేవ్యశ్రీపర్ణిన్.

గీ. కాంచి యిది పాండ్యభూపాలకాంచితమగు, కేళిదీర్ఘిక యిదిమంచికెంపురాలు
గలుగుమండెకు గని యిది కలశభవుఁడు, నిత్యసంధ్యావిధులు తీర్చు నెలవటంచు.

వ. అందు నందఱుఁ దీర్థంబు లాడి.

క. ఆతామ్రపర్ణి చెంగట, నాతామ్రప్రచురకిసలయద్యుతి సహసం
జాతామ్రవరణములవి, ఖ్యాతంబై మించునట్టి గజతీర్థంబున్.

వ. కనుంగొని తత్తటంబున నిల్చి యందఱు నానందంబు తోడ.

సీ. లాలితబాలశైవాలజాలచ్ఛాయ నీలకాయంబు వన్నియఁ బొసంగఁ
బైనిండఁ బర్విన పద్మపరాగముల్ హాళిఁ దిశాపిత ఛాయ ననుకరింప
నగ్రజాగ్రద్వివీలాంబుజాత శ్రేణి చాఁపిన తొండంపు జాడ నమరఁ
బార్శ్వతటోడ్డీనపక్షినాదంబులు ఘంటాఘణాత్కార గరిమఁ బెనుప
మారుతోద్ధూతశీకరమండలంబు, ఘనవమధువిభ్రమము దెల్ప ననవరతముఁ
దనరు గజతీర్థ మనుట సార్థముగఁ జూపె, నద్భుతంబుగ నీసరోజాకరంబు.

క. అని పొగడుచు నాచెంగట, ననుపమతపమునఁ జెలంగు నాత్రేయుండున్
మునిఁగని యీతీర్థగరిమ, మనఘా వివరింపుమనుచు నతఁ డిట్లనియెన్.

చ. కరిణులు గొల్వ నొక్కకరి గాటపు వేసఁకఁ దొల్లి భూధరాం
తరఘనకందరాటవుల దాపుల చేఁపులు మేసి మేసి మై
బియసుగ నెండవేఁడిమిఁ దపింపఁగ దెప్పరమైన దప్పిచే
దిరుగుచు నెందు నీరుగలతెంకులు గానక దీనకంఠమై.

క. మన్నులు రేఁగఁగ నేనుఁగు, మన్నిఁ దడవిఁబడి యెండమావులు ద్రావం
గన్నఱఁ బఱచుచు నడియా, సన్నగలుచు వ్రాలి సోలి జాలింబడుచున్.

గీ. కొన్ని పెంటియేనుఁగులుఁ దానుబోకయై, యూఁకదప్పి దప్పి మోము లెండఁ
జల్లగాలిజాడ మెల్లన యరసి యా, సరసి దరిని నింపు బెంసి యంత.

క. కడుపులునిండఁగ జలముల్, వడిగ్రోలెం దొండములను వారక సరసిం
బుడబుడమనుచుచుఁ బ్రిక్కులఁ, గుడియెడమకుఁ జల్లికొనుచుఁ గుంభీంద్రంబుల్.

క. నిండార జలము ద్రావియు, వెండియువెండియును గడుపు వెలితిగఁ బైపై
నొండొండ క్రోలి జలరుహ, షండంబులతోడఁ గ్రీడ సల్పుచునుండన్

క. మకరంబొక్కటి యక్కరిఁ, గిఱుఁరించుచు వాడికోఱగిఱకలఁ బదముల్
వెకలించిన నించుకకద, లకయుండంబట్టె బిట్టు లావడరంగన్.

ఉ. పట్టిన నగ్గజేంద్రమును బాదములరి వెకలించిచూచి యి
ట్టట్టు చలింపరా కతిభయంబున మస్తకముం దటంబులం
గొట్టుచుఁ గూఁతవెట్టుచును గుంభయుగాంతరసీమ హస్తమున్

బెట్టుము నార్తిహారి హరిఁ బేర్కొని యుచ్చతరస్వనంబునన్.

ఉ. ఓహరి యోదయాంబునిధి యోభవబంధరుజాపహా మహా
దాహముచేత నంబువులు ద్రావఁగ నిచ్చటఁ జేరి యీజల
గ్రాహముచేతఁ జిక్కుపడి గాసిలితి న్ననుఁ గావవే యసం
దేహముగాఁగ నీవ యిట దిక్కు సుమీ ఖగరాజవాహనా!

క. అనిపల్కెడు కరిమొఱఁదా, వినిగొనెనో వినలేదో యింతవిస్మయముగ సం
తన దీనభక్తరక్షణ, ఘనుఁడు మురాంతకుఁ డనంతకరుణపలిర్వన్.

సీ. తనుఁబిల్చినప్పుడ వినిపోనుపడెనంచు మకరంబు కరి రేఁపుమడఁచునొక్కొ
విభుఁడు గల్గిన మొఱవినఁడె లేఁడని దంతి జడిసి ప్రాణము లేడవిడుచునొక్కొ
యార్తులరక్షింతు ననిపల్కుచుండెడు బిరుదు నేఁటికి లేక జరగునొక్కొ
యుంకించివైచిన యూరుపడి సేనియుఁ జక్రంబు నక్రంబుఁ జఱచదొక్కొ
యనుమఁ దార్క్ష్యుండు మదిమీఱి చనఁగవాగె, నిటకియొత్తుము నచ్యుతుఁ డేగుదెంచెఁ
దనదు దర్శనమును సుదర్శనము నపుడు, చక్రపదనక్రముల నొక్కసారెఁ బొదువ.

క. హరిగరుడులనుచు లత్తఱి, సరిగా నొండొండ తీవ చాలుగఁ దగ్గ నం
బరమున గన మెప్పునను గం, ధరమణిఘనువులని యాత్మఁ దలఁచిరి వేల్పుల్.

క. కరి తలఁచుట మునుపో హరి, కరితలఁ గరమిడుట మునుపొ కాదగు నని యొం
డోరులం బలుకుచుఁ దలఁచిరి, యరుదుగ సుర లలికరంజితాంజలు లగుచున్.

క. చక్రపదసార్వభౌముని, యాక్రందనరవమునందు నైక్యము నొందెం
జక్రికరచక్రవిదళిత, నక్రార్తరవంబు వెఱఁగునన్ సురలుండన్.

క. హరిహస్తస్పర్శనమునఁ, గరియును గరిభావ మెడలి గంధర్వుండై
సురమార్గంబున నాయుం, బురుహాక్షుం భక్తరక్షుఁ బొగడుచుఁ జనియెన్.

గీ. నాటఁగోలెను గజతీర్థనామ మొదవె, నీసరోవరమునకు మునీంద్రులార
యిందుఁ గ్రుంకిన జనులకు నిందుధరుని, కంటె మిక్కిలి సంపదగలుగుచుండు.

వ. అనిన విని యక్కరివరదుని మహత్త్వంబు చిత్తంబుల హత్తి నృత్తంబులాడుచుండ.

సీ. పందెమిమ్మని లక్ష్మిపంతంబుతోనన నెద కౌస్తుభ మెడల్చి యదరవైచి
పడఁతి పాదములందుఁ బావలు గదియింపఁ దొడిగియుఁ దొడుగక తొలఁగఁద్రోచి
కదిసి విష్వక్సేను కైదండ యొడిసియుఁ గడువేగ మడరంగఁ గడకు నూఁకి
బరిమేని గరుడుని నురువడిమై నెక్కి పదపదమని సారె పన్నె నోఁకి
సురలు గని క్రొమ్మొక్క యసురులు సురిగి క్రుక్కఁ, జక్రమున నక్రశిరమును జక్కుచేసి

హస్తమున హస్తిమస్తంబు మస్తరించి, వెలయఁ శ్రీహరి శుభము గావించు మాకు.

క. అని పొగడుచు నాతీర్థం, బునఁ దానములాడి వెడలి మునిశేఖరుల
వ్వనజాక్షభక్తరక్షణ, ఘనకథలు నుతించికొనుచుఁ గౌతుక మెసఁగన్.

మ. ఇభతీర్థంబటు దాఁటి యవ్వల మునుల్ హిండత్త్రివాసాంద్రచం
ద్రభటాభంగఘటీవటాయుతము లానందంబునొందింపఁగా
శుభవారిందనువుల్ దొలంచి యవలన్ సొంపొందునింద్రోపల
ప్రభలన్ వెల్గెడు బాలకృష్ణు విభవభ్రాజిష్ణు సేవించుచున్.

క. సీతాపతిహోర్వైభవ, కేతువు దశవదనమదనక్షేపైకకథా
హేతువు తాపసజనజీ, వాతువు సేతువును జూచువాంఛలు వెలయన్.

వ. అవ్వలనం జని రనిన విని యమ్మహర్షు లత్యంతహర్షంబునం దరువాతివృత్తాంతంబు వి
వరింపు మని యడుగుటయు.

మ. భువనాపూర్ణపిచండ చండదనుజాంభోజాతవేదండ దం
డవినమ్రామృతకుండ కుండలిపఖట్వావైభవాఖండ ఖం
డవిధూత్తంసకకాండ కాండజహరాండద్ధామమార్తాండ తాం
డవితోద్దండశిఖండిమండలవిభాడంబాంబుదోజ్జృంభణా.

క. బంహిష్ఠనిష్ఠురాశుగ, సంహతిసంహృతనిశాటకూటమహీభృ
త్సింహ సతతోపనిషదుప, బృంహితవేదైకమూర్తి ఘనకీర్తీ.

పంచచామరము. ఘనాఘనాభ తారకప్రకాశ భక్తరంజనా
జనావనాభుజాగ్రచక్రజర్జరత్వలాశనా
దినాధినాథయూథతేజ ఐక్ష్వసిద్ధశాసనా
సనాతనాసుధామృగేంద్ర చంద్రజిద్యశోఘనా.

గద్యము. ఇది శ్రీరామ చంద్రసాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వతవిశేషనిరర్గళ
వాగ్వైభవాశేషసరససాహిత్యకళాభోజ సత్యసంభూషితముఖాంభోజ సకలసా
మ్రాజ్యధౌరేయ నిరతావారితాన్నసత్రసంతోషిత ప్రతిదివసపంచాశత్సహస్రభూ
సుర బహువారావర్తితమహాదానవైభవానర్తితభాసుర నిజనామాంకితాకళంక వస్తు
సమగ్ర బహుళాగ్రహారభూషితచోళధరామండల నిఖిలభోగనిర్జితాఖండలసాధిత
సముద్రాంతరద్వీపపరనృపాలసంస్తుతప్రతాప నేపాళభూపాలస్థాపనాచార్య క
ర్ణాటరాజపూజనీయ ధౌరంధర్య రామసేతుశ్రీరంగవిజయరాఘవపుర కుంభకోణా
దిదివ్యస్థలప్రతిష్ఠాపితరామభద్ర సర్వజనసంభావితగాంభీర్యముద్రావినిర్జితసముద్ర

సదాశ్రితభరణదీక్షాదక్షదక్షిణసింహాసనాధ్యక్ష రాజాధిరాజనన్నతాసాధారణ శౌర్యదిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనక సతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూధ భువనశోభితగుణసనాథ బలవత్పరిగృహీతసామంతమహీకాంత విమోచనశ్లాఘనీయబాహాబల మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల చినచెవ్వయాచ్యుతనృపాలపుత్ర సజ్జనస్తోత్రపాత్ర రూపరేఖావిజితకుసుమసాయక శ్రీరఘునాథనాయకప్రణీతం బైనవాల్మీకిచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# వాల్మీకిచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీకాంతాకుచభద్ర, శ్రీకాంతభుజాంతరాళ శీతలకరుణా
లోకప్లావితనత యత, సీకుసుమసమానధామ శ్రీరఘురామా!

వ. అవధరింపు మప్పుర్వృతుం డమ్మునుల కిట్లనియె నవ్విధంబున నమ్మునీంద్రులానందంబున.

క. దక్షిణదిగ్భాగమునఁ బ్ర, దక్షిణగతి నరిగి యరిగి దర్భశయనముల్
వీక్షించి సేతుమూలా, ధ్యక్షుఁ శ్రీరాముఁ గొలిచి తద్దయు వేడ్కన్.

సీ. చక్రతీర్థంబున స్నానంబు గావించి బేతాళవారిధి స్నాతులగుచుఁ
బాపవినాశినీ ప్లావనం బొనరించి సీతాసరస్సునఁ జెలఁగియాడి
మంగళతీర్థసంపర్కమానందించి యమృతవాటికను దేహములు దోలఁచి
లక్ష్మణతీర్థఖేలనమున నలరుచు రామతీర్థంబు పూరములఁ గ్రుంకి
శంఖచక్రజటాతీర్థజలములందుఁ, దానములు చేసి గంధమాదనసుగంధ
మందరసుగంధవనమందమందగంధ, వాహముల దేహముల శ్రమ మ్రాల్పి ప్రోల.

మహాస్ర!! చని చూచల్ కాంచి రంతన్ సరంభసవిసరత్సాంద్రవీచీమరీచీ
జనితోద్దాఘాంధకారస్థగిత దశదిశాచక్రకద్యోతివిద్యో

తనకృత్యాకీనఘూటోత్తరళతరద్యుగంతప్రభా......
క. ............ ...లా
కాంచితపాఠీనఘటా, చంచల్లుఠనములు సారెసారెకుఁ గన్గొనుచున్.
గీ. వెండియును వారలు హనుమత్కుండమునను, బ్రహ్మకుండంబునను దీర్ఘరాజమైన
కోటితీర్థంబునను ధనుష్కోటియందుఁ, గ్రుంకులిడి రామలింగంబుఁ గొలిచినిలిచి.
క. అలంకాపాథోము, ధ్యాలంకారప్రకారదాకారమునం
గ్రాలు నలరామసేతువు, నాలోకించుచు మునీంద్రు లతిహర్షమునన్.
చ. పరిసరవిద్రుమద్రుమవిభాపటలంబుల డంబు నల్లడం
బొరిఁబొరిఁ గప్పనొప్పె రఘుపుంగవుసేతువు చూడుమో మునీ
శ్వరకులచంద్ర యీజలధిశైవలినీతతి యచ్చుగెంపురా
సరిపెణ యైన నీటుగన జందెపువాటుగ వైచెనో యనన్.
క. బిట్టురువడి నూతేన్చుఁగు, లిట్టలముగఁ బోరవరుణుఁ డెప్పుడు నడుమం
గట్టించిన తెట్టన నీ, కట్ట సెలంగెడును వారికాంక్షిప్రవరా!
క. వారిధిరంగస్థలమున, జేరి తరంగమ్ములనెడు జెట్టులు పైపైఁ
బోరంగ నడుమ బలుపిరి, సారించిన సరణి సేతుసరణి చెలంగెన్.
క. ధరణీతరుణీమణికం, బరమగు నీయంబురాశి మధ్యంబున న
బ్బరపునెరిక యన సేతువు, గరమలరెను వివిధతరునికరదంతురమై.
క. ఆలోకించితె సేతువు, నాలోకాలోకమహీధరాకాంచలమా
పౌలస్త్యజయస్తంభము, వ్రాలిజలధిఁ దేలియాడు వగఁ గనుపట్టున్.
గీ. భోగికులపతిసంతతి భూమివలయ, వహనజాతపరిశ్రాంతి వదలనుదధి
పైకిఁదేలుచుఁ దనసంధిభారమెడల, నిగడెనో యన సేతువు దగె నరేంద్ర.
ఉ. ఈషనరాశి మీఁదట శయించిన మాధవు గౌరవించి యిం
పావహిలన్ మహీమహిళ యాదటఁ జాఁచినహస్తమో యనం
గావిలసిల్లెడున్ గలితకంకణనాదము లించ రాఘవ
ప్రస్తావరు సేతు వెంతయును గౌతుకమిచ్చు మునీంద్రచంద్రమా!
క. అనియిటులు వివిధగతులను, వనపథిఘనసేతుమహిమ వర్ణించుచు న
మ్మును లచటు గదలి బహుపు, ణ్యనదులు వనములును గాన నరయుచునుండన్.
మ. కననయ్యెం బురరత్నమొక్కటి వియద్గంగాతరంగానుషం
గనవస్థంవరగంధవాహవిధుతాంగక్రాంతి నృత్యద్ధ్వజా

జనమంజీరఝణంఝణధ్వనితచంచచ్చంద్రశాలావిలా
ననవేందూపలసౌధయూథరుచిసంఛన్నాగ్రదిగ్భాగమై.

క. అదిగని మధురానగరం, బిదిగోఁ దడవులకుఁ గంటి మీకృతమాలా
నదిఁ గ్రుంకి సోమసుందరుఁ, బదరక సేవింపవలయుఁ బదపదఁ డనుచున్.

గీ. అరిగివారలు హేమపుష్కరిణిచెంతఁ, గాంతతరమైన నీపవనాంతరమునఁ
దనరుకర్పూరసుందరుఁ దరుణశీత, కిరణశేఖరు గని నమస్కృతులు సేసి.

గీ. పంచశరభంగ కర్పూరపాండురాంగ, మేరుకోదండ ధృతరమామిత్రకాండ
నాగవరహారకలధౌతనగవిహార, నీకు మ్రొక్కెద మభవ యనింద్యవిభవ!

వ. అని సన్నుతించి వెండియుం జతుష్షష్టిలీలావినోది యగు హాలాస్యనాథుని మహిమ భావించి.

సీ.. మునులకందఁగరాని మోక్షంబు పక్షికి దయచేసె నెవ్వాఁడు నయమెలర్ప
వివిధార్థములుగ ద్రావిడసూత్రములు సలక్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబుల దురంగంబులుగాఁ జేసి యమ్మె నెవ్వాఁడు పాండ్యాధిపతికి
శ్రుతినిందకులఁ దామసుల శూలవిద్ధులఁ గావించె నెవ్వాఁడు ఘనత మెఱయఁ
దట్టఁదలఁ బెట్టి పట్టెఁడు పిట్టొనంగు, ముసలియవ్వకునై మన్ను మోచె నెవ్వఁ
డట్టిలింగస్వరూపున కఖిలపతికి, సోమసుందరునకు నీడు జోడుఁగలరె.

వ. అని వర్ణించుచు నవ్వలం జనిచని.

శా. అంతం గాంచిరి వారి మాడ్కి కనవద్యప్రోద్యదుద్యానముల్
వింతల్సేయుచు నుండఁగా నుభయకావేర్యంతరీప్రాంతరా
క్రాంతాక్రాంతవిచిత్రగోపురఘనప్రాకారసౌధావళీ
ప్రాంతప్రోతమణిప్రభోజ్జ్వలనభోరంగంబు శ్రీరంగమున్.

క. కనుఁగొని కావేరీజల, మునఁ గ్రుంకుచు వేదశృంగమును బ్రణవమయం
బును నగురంగవిమాన, మ్మునకు నమస్కృతులు సేసి మునికులచంద్రుల్.

సీ. మంచితెమ్మెరదూది నించిన గోదుమవన్నె పానుపుమీఁద నున్నవాని
వలచే దలాడగా నిలిపి వామకరంబుఁ జిఱుతొడ పైఁజాఁచి మెఱయువాని
దృక్కోణఘన ఘృణామృతము మీ కెదురులీల, నైలవప్పు చెక్కుల దొలఁకువానిఁ
ఘనపాదపద్మముల్ దప్పక సేవించు నలవిభీషణుఁ జూచి యలరువాని
సరసవాయక జయజయశబ్దములను, మించుపంచాయుధములను నించువాని
రంగతరళితమణిభూషణాంగవిభుని, రంగవిభుఁ గాంచి చిత్తముప్పొంగుచుండ.

క. దండము లిడినిలిచి సము, ద్దండఘనశ్యాము రంగధాముం*బాశో
ద్దండజనకు నానాజగ, దండధురంధరు నుతించి రంచితఫణితిన్.

శా. కావేరీహృదయాభిరామపులినాకల్పాహితల్పంబునన్
శ్రీవామాక్షియు నీవు లోకములు రక్షింపంగనున్నాఁడవే
యోవిశ్వంభర యోకృపాజలనిధీ యోరంగగేహాంచితా
శ్రీవత్సస్తుతవత్స వత్సలత రంజిల్లన్ మముం బ్రోవవే.

వ. అనిమఱియు మునిపుంగవు లాభుజంగశయనుం గని యంతరంగంబుల భక్తి యుప్పొంగుచుండ.

చ. తలగడ బాముఁజేర్చుకొని దయ్యము నెయ్యము నమ్మి యేటిలో
నెలవుగ నిల్లుగట్టుకొన్ని నీవిటులుండఁగ నోర్చు టెట్లు మా
వలనగు మానసాబ్జముల వాసము సేయుం; కొంతలేదు నీ
యలమట దీఱెడున్ విను విహంగమవాహన రంగమోహనా.

క. అన వారి శుద్ధభక్తికి, ననయంబును నలరి రంగహరి నవ్వుచు మీ
మనసులలోనని యున్నాఁ, డను జనుఁ డని పలుక నజ్జటాధరవరులున్.

సీ. పంకజబంధుబింబస్థాయి త్రైలోక్యమంగళదాయి శ్రీరంగశాయి
సకలజనానందసంధాయి గరుడతురంగమయాయి శ్రీరంగశాయి
సహ్యకన్యాతటాంచలకులాయి ప్రపంచరక్షణోపాయి శ్రీరంగశాయి
యఖిలదైవతసంసదతిశాయి యగణితబ్రహ్మాండశాయి శ్రీరంగశాయి
నిఖిలజగదింద్రజాలంబు నెఱపుమాయి, యచ్చులకునెల్ల మొదలనచ్చైనవ్రాయి
కొలుచువారలపాలిటి తలఁపురాయి, రావణానుజదాయి శ్రీరంగశాయి.

గీ. రంగనిలయోపవాసంబు రంగనాథ, చరణపంకేరుహద్వంద్వసంభజనముఁ
జంద్రపుష్కరిణీస్నానసంగతియును, గలిగె మనలకు భాగ్యంబుకతన నేఁడు.

వ. అని పొగడుచు నవ్వలం గడచియంత.

---

* పాశోద్దండుఁడు=బ్రహ్మ. బ్రహ్మకుఁ బాశముఁ జెప్పినందునకు, "కమలజుపాశంబు గా లాపుఁ డ్రాడుగాఁ గాలోగ్రదండంబు గడయుఁగాఁగ." కుమార. అశ్వా ౧౦-౧౫౩ వ పద్యము. మఱియు "వేదచతుష్క మిల్లద, రజోగుణమిల్లద పద్మపీఠమి। ల్లద, కలహంసమిల్లద, కమండులువిల్లద, పాశరజ్జువి। ల్లద." జగన్నాథవిజయము. ఆ ౫-౬౧.

సీ. ఏపీఁటనిరవొందు నిందుశేఖరుఁ డెప్డు బృహదీశ్వరుం డను పెంపుఁ గాంచి
యేపట్టణమునకు నేలికయై నృసింహస్వామి జనకామితార్థభూమి
యేప్రోలికెలన నెప్డేలరారు నీలమేఘశ్యాముఁ డిందిరాకాముకుండు
నేనగరమున నిర్హేతుకదయఁ బ్రోచు నతికల్పవల్లి యానందవల్లి
యెచట విలసిల్లుఁదగ సుందరేశ్వరుండు, ప్రాంతకాంతకావేరకన్యాంబుధన్య
వివిధసస్యప్రశస్యయై వెలయుచుండు, నట్టితంజాపురంబున కరిగి వేడ్క.
ఉ. అందలి సౌధయూధములయందము నచ్చటికేలికావనీ
బృందము చంద మాకెలన బింకపుఁజాపులఁ గోవులించఁగా
నిందుముఖుల్ నటించువగ నెల్లఁ గనుంగొని పొంగి యార ఫా
రంపర పట్టనంబె యిది రా మది రాజిలె నంచు నెంచుచున్.
మ. చని రమ్యాశ్మనులు నంతఁ గొంతదవులన్ సాంద్రద్రుమాకీర్ణకా
ననముల్ కొన్నిటి దాఁటి ప్రాగ్దిశరమానాథప్రభారమ్యహ
ర్మ్యనికాయంబులఁ జూడఁజూడఁ గుతుకం బాదక్షిణద్వారకం
దనరన్ నిల్చిన మన్ననారుపసుధాధారు న్నిరీక్షించుచున్.
క. సేవించి తదాకృతి మదిఁ, భావించి కరాబ్జయుగళిఫాలస్థలికిన్
రావించి మిగుల సన్నుతి, గావించి ముదశ్రుపూరకలితనయనుఁడై.
సీ. పసిబిడ్డయై యుండి బండిరాకాసికి నెడలఁదన్నినయాతఁ డితఁడకాఁడె
కాళియభోగరంగస్థలంబునయందు నృత్తమాడినయాతఁ డితఁడకాఁడె
గొల్లయిల్లాండ్ర మక్కువలెల్లఁ గొల్లాడి యేనుగాననునాతఁ డితఁడకాఁడె
గోధనంబులకెల్ల గొడుగుగా గిరివ్రేల నెత్తిపట్టినయాతఁ డితఁడకాఁడె
యిచట సంపంగిమొగ్గతో నెతులసిగయుఁ, జేతబెత్తంబు మొలను బసిండిపిడియ
మును నమర రాజవేషముఁ బూనియున్న, వాఁడితనిమాయఁ దెలియంగ వశమె యెవఁడు.
గీ. అనుచు నారాజగోపాలు నభినుతించి, మించి కమలాపురంబును గాంచి యచట
భోగరాగంబులను జాలఁబొలుపుమీఱు, త్యాగరాజుల సేవించి హర్షమెసఁగ.
చ. అనఘరతుల్ మునీంద్రులు ను నావల నావలమానశీతపా
వనపవమానముల్ శ్రమజవారి హరింపఁ గవేరజాతటీ
ఘనవివిధాగ్రహారములు కౌతుకముం బచరించుచుండఁగాఁ
గని రటఁ గుంభకోణము ధగద్ధగితేందుమణిప్రఘాణమున్.
వ. కనుంగొని యచ్చట.

సీ. చక్రపాణికి నమస్కారంబు గావించి శార్ఙ్గపాణికిఁ గరాంజలి ఘటించి
కుంభేశ్వరునకు మ్రొక్కులు గూర్చి యాలసోమనాథుల కభివందనములు సేసి
నాగనాథునకుఁ బ్రణామంబు నవరించి విశ్వనాథునకును వినతిసలిపి
అవిముక్తశివునకు సాష్టాంగదండంబు లాచరించి మఱియు నచటఁ గలుగు
దేవతాతతి కెల్లను భావశుద్ధి, చెలంగుచుండ నమోవాక మలవరించి
యభ్రపథఁ జూచునతుక మదభ్రలీల, నలర నమ్మునిపుంగవులవల దాఁటి.
క. శ్రీముష్ణముఁ గాంచి తప, శ్రీమించఁగ నిత్యపుష్కరిణిఁ గ్రుంకి దయా
భూమిన్ శ్వేతవరాహ, స్వామిన్ సేవించి యవలఁ జనిచని యంతన్.
ఉ. సాంజలులై పతంజలి మహాముని రంజిలి చూడఁగా దివస్
మంజులపాదనూపురఝుళంఝుళనధ్వని మ్రోయుచుండఁగాఁ
గెంజడ లాకసంబడరఁ గేవలతాండవమాడెఁ జిత్తభూ
భంజనుఁ డెందు వేడ్క నలభర్మసభం గని విస్మితాత్ములై.
గీ. ఇందుశేఖరు సేవించి యెందుమాకు, భేదమెక్కడి దంచుఁ గాన్పించు లీల
నందునుండు భోగవిభవంబు లందుమండఁ, దిల్లగోవిందరాజులఁ దేటభక్తి.
వ. కొలిచి మఱియు నాభ్రసభాపతి విభవంబులు పరీక్షించి.
సీ. నొసలికన్ బెనుమంట మసలునో పైకన నిడువకెంజడగుంపు గదలుకొనఁగ
నిలనూఁదు పాదము వలగొన్న నూపురం బొండొండ శబ్దంబు లుగ్గడింప
భస్తులఁ బిలిచి సంపదలిత్తు ననుభంగి ఢమఢమధ్వనితోడి ఢక్క మొరయ
మౌళి చందురుఁడు డాకాలియందియఁ దోఁచి నిర్ద్వంద్వభావంబు నెరయఁజేయ
మత్తిమై యొప్పు గెంటెంబు గుత్తమగను, గటిని రింగులువాఱంగఁ గట్టె యసుర
మట్టి నాట్యంబుసలుపు నుమాధవుండు, మాకు విభవంబు లొసఁగుచు మనుచుఁ గాత.
వ. అని సన్నుతించుచు నిలింపబాలికాకేళికాభవనాయమాన మాణిక్యఖచితచకచకితసౌధయూథప్రభాడంబరం బగు చిదంబరంబుఁ గడచి యంత.
క. అరుణాచలవిభుఁ గరుణా, వరుణాలయుఁ గాంచి కాంచివరదునిఁ దేజ
స్ఫురణారుణమణినానా, భరణాంచితు నేకమ్రాతపతిఁ గనుగొనుచున్.
చ. చనిచని కాంచి రంత హరిచందనభూరుహచారువాటికా
వనివసితాసహాయసురవైణికతల్లజపాణివల్లకీ
ఘనవినిధానుకారిమణికందరజాలముఁ బంచవర్ణకాం
చనకలశాంకచక్రవిలసద్ధ్వనిశీలము శేషశైలమున్.

వ. కనుంగొని యవ్వేంకటమహీధరంబున వికంకటమణితటంబులందు ముఖ్రమోసినగతి దుముకు నాకాశగంగాతరంగిణీ సంగంబులు దొలంచి యభంగభంగ తాండవంబులం బెరయు పాండవతీర్థంబునం దానంబులు గావించి తటమహీరుహాకదంబకప్రసవదంబరంబులం గదంబించు తుంబురుతీర్థంబునం గ్రుంకులిడి మఱియు నఘౌఘనోదనసమర్థంబు లగు ననేకతీర్థంబు లాడుచు వచ్చి వచ్చి మజ్జనపరమజ్జనపుష్కలాయుష్కలావిష్కారిణియుఁ బాపిజనపాపశంకదుష్క్రియాపంకజకరిణియు నగుస్వామిపుష్కరిణిఁ దీర్థంబులాడి.

గీ. కువలయంబున నిరిజువైకుంఠమనుచుఁ, గరముఁ జూపుచు భక్తిని గరము ప్రోవ
స్వామి పుష్కరిణీతీరభూమి నలరు, వేంకటాచలనాథు సేవించి నిలిచి.

సీ. మణికిరీటంబు సంపదలేమి యనవచ్చు నమ్ము ముత్తియపునామమ్ముడంబు
మందహాసంబుల యందంబు హైనరే సరిలేదు మెడకంటసరికి సాందు
నురబంధము నొప్పు లోహాహా యెచ్చుల మెచ్చువో బంగారు పచ్చడంబు
కటిఁ బసిండి కటారి కాంతి యెంతటిదింతి మంజీరముల మంజిమంబు మేలు
ఉచితశృంగార మితనికి నొప్పఁజూడుఁ, దిట్టిచక్రనితంద్రి యెంకేని గలఁడె
వలతు రీవేంకటాచలవల్లభునకు, యోగిపురుషులు మదియందయునిచి చాల.

వ. ఇక్కరణి నక్కంజాక్షుని చక్కఁదనంబునకు మిక్కిలి చొక్కి మఱియును.

లయ. పంకజకరాంచవిశంకటతటీరచితకుంకుమపటీరరుచిసంకలితవక్షో
లంకరణకౌస్తుభశశాంకరవిలోచన ప్రియంకరగుణప్రకరకింకరదమర్త్యా
శంకర మహానతిశివంకర సురాహిత భయంకర శరాగతకశంక భువనత్రే
మంకర మునీంద్రగణసంకథితపావననిరంకుశమహామహిమవేంకటగిరీశా.

క. సంకటము లెల్లఁ దొలఁగెవి, శంకట భవదీయవితతసలిలఘనఘృణా
కంకటము గలుగ మాకున్, వేంకటగిరినిలయ కాంతివిజిత కువలయా!

గీ. అనుచు నవ్వేంకటాద్రీశు నభినుతించి, మించి యవ్వలఁ జని మునుల్ గాంచిరంత
నంచితానందతీర్థసమర్థనసుమ, హాబలంబగునట్టి యహోబలంబు.

క. కాంచి మునిచంద్రు లచ్చటఁ, జెంచుల దొరయనఁ జెలంగి చెంచెతలకటా
క్షాంచలముల మరగిన నర, పంచాననుఁ భక్తవరదు భజియించి తగన్.

సీ. హరి యిక్కడను సామిహరియై హిరణ్యకశిపుఁ జీరె ఖరనఖశిఖరములను
బక్షీంద్రుఁ డిటమనస్సాక్షికంబుఁగ దపం బొనరించి విష్ణువాహనతఁ జెందె
గంగ నిర్జరులు డిగ్గంగఁజేయఁగ నిందు భవనాశినీధునీప్రథ వహించె

నజ్ఞాత్ముఁ డిచ్చటఁ గుజ్జామ్రభూజమై యమృతఫలములు దీనాళికిచ్చె
నను మనన్పటిమహిమంబునభినుతించు, కొనుచునకొండఁగలతీర్థకుండములను
దానములు చేసిమీఁది నెత్తంబువెంట, నరిగి యవ్వలనమ్మునుల్ హర్షమెసఁగ.

సీ. తపణిల్లు నెచటఁ గాష్ఠజ్యోతి విద్యోతితారణ్యనివహమై యహరహంబు
నొనరు నెచ్చట ద్రుణజ్యోతి ఖద్యోతకీటమై ఘనగుహాగేహములను
గ్రాలు నెచ్చట వాలుకాజ్యోతి సద్యోతిమోహితశబరసమూహమగుచు
నుండు నెచ్చట శిలాజ్యోతి యుద్యోతితశృంగంబులను రత్నభంగి నెపుడు
నలరు నెచట బరంజ్యోతి యతివిశుద్ధ, తరణిమణిశబ్దబిలధగద్ధగితభాగ
యోగసన్నద్ధ బహుసిద్ధ యోగిమతుల, నట్టి శ్రీపర్వతమునకు నరిగి రంత.

క. గంగాది తీర్థజలముల, నంగంబుల దొలఁచి మల్లికార్జునునకు నా
రంగగిరిమల్లికార్జున, రంగత్కుసుమములఁ బూజ రచియించితగన్.

మ. కనిరంతన్ భ్రమరాంబికన్ హరిమణీ కాదంబకాదంబినీ
జనిశోభానికురుంబ నంబర చరీచంచత్కరాంభోజ భా
జనవాలవ్యజనానిలాంకుర చలాంచత్కుంతలం గాంతలం
ఘనజంఘాలమృగేంద్రవాహన నహీంద్రాద్రి వేయ శాతోదరిన్.

క. కనుఁగొని సాంబశివస్తవ, మునవమ్ముకుటావబద్ధముగ్ధసుధాంశున్
వినుతించిన నాత్రిభువన, జనకుండును నద్భుతంబు సంఘటిలంగన్.

సీ. చుక్కల దొరయొకించుక నిక్క సిరిసునఁ బదినూఱు ముంగులపాగఁ జుట్టి
తఱచు వెన్నెలలీను దళుకు నెమ్మోమునుపైఁ దొలుపల్కలీనెడు తొడవు వెట్టి
ముద్దులజింక మున్నొన పోటుముట్టును నరవితో రెండుహస్తములఁ బట్టి
పెళపెళమను చెఱుంగులరంగు లడరెడు మూఁడువన్నెలపట్టు మొలను గట్టి
కేల్మొఱుకు ముత్తెయఁపుఁజాయ గిబ్బనెక్కి, చారుతరహారశృంగారహారియగుచు
ధారుణీధరరాజనందనయుఁ దాను, నమ్మునీంద్రులమ్రోలఁ బ్రత్యక్షమయ్యె.

గీ. ఇట్లు సాక్షాత్కరించి యాఋషులఁగాంచి, దాంతిఘనులార మీదు వదాంతికనుతి
మెచ్చివచ్చితి నిచ్చలు నిచ్చహెచ్చు, కోర్కెలెల్లను మీకుఁ జేకూరుఁ గాక!

గీ. ఇదియు కాదెన్న నిచ్చట నెందునెవరు, నెంతమాత్రంబు నుతియింతు రంతలోన
నేను వారి కభీష్టంబు లిత్తు వేగ, మౌనివరులార యీగిరిమహిమవలన.

వ. అని పలికి భుజంగకంకణుం డాలింగమధ్యంబునం బ్రవేశించె నంత నకాంచనా
చలచాపస్వరూపావలోకంబున నానందంబు నొందుచున్న యమ్మునిచంద్రులుం గు

కుటజప్రసూనవాసితంబు లగుకుటజప్రఘాణంబుల నేణీడింభంబులు సంభ్రమంబున న క్కడక్కడ జాటి పరికొను కామధేనూధస్యధారాసారంబులు చవిగొని త్రుళ్ళగింత లిడు వానివెంబడిం బరువులిడు మునిబాలికల కేళికలు విలోకించి తదంగణంబుల ము నిగణంబుల పవిత్రధవిత్రంబుల హోమధూమంబుల నతిశ్యామాభిరామంబు లగుదరు స్తోమంబు లంబుదకదంబంబులని మనంబులం జేరి మయూర నాదుమయూరార్భకం బుల లోగొను నశ్మగర్భరశ్మిచ్ఛటాచ్ఛురితంబు లగుభూములం గనుంగొనియుం గ నకపత్రస్థానంబులం గాసన సీధుకాననలగు భిల్లపల్లవాధరులు భల్లంబులం ద్రెళ్ళ నేసిన తమనిసువులం జూచి సంజీవకరణిం దిరుగం బ్రదికించి వానితోఁగూడి సంచరించు కొం చనగరుల్లక్షితంబులగు పక్షుల నీక్షించియుఁ దత్ప్రాంతంబుల నతిశాంతంబులగు శశి కాంతశిలాంతరంబుల ప్రకేవలం గుంభకప్రభావంబున శిలాంతరబంధులుంబోలె నిశ్చల త్వంబు నెనసి భస్మితభసితోద్ధూళితాంగులగు మహాయోగుల బాగులు దర్శించియుం దత్తపోజనమహత్త్వంబునకు నంపంద డెందంబున నానందించుచు.

వింధ్యభూధరముకు బయల్ వెడలి యచట, నఖిలలోకైకశర్మద లైనయట్టి
నర్మదనుగ్రుంకి మునిశరణ్యంబులగుచుఁ, బొదలెడునరణ్యములుఁ బుణ్యనదులుఁ గడచి.

ప్రతివీధిసంచరత్పార్వతీచరణాంబుజాతనూపురఝుళంఝుళరవంబు
విశ్వనాధవిహార వృషభరాజాఘంత కంఠ ఘంటా ఘణంఘణనినదము
పటుహారవ దభంగ భాగీరథీభంగ సంఘుఘుమంఘుమన్వనభరంబు
రక్షాధికార భైరవ భుజాస్తంభ గంభీరఢక్కాఢంఢమారవంబు
సరవినెచ్చోటమోక్షంబుజాటు సిరుల, కాపురంబగు నాకాశికాపురంబుఁ
దటిసి మణికర్ణికాదితీర్థముల నాడి, యభవుసేవించి యచ్చట నలరుచుండ.

ఆకాశీశ్వరు తార్తి, యైక విలోచనమునందు నెనఁగెడు సెగతే
పైకొనియెననఁగ లోకం, బాకులపడఁ దోఁచె గ్రీష్మ మతిభీష్మంబై.

పటపటఁబగిలెం గుంభిని, తటతటఁబధికులమనంబు తల్లడపడియెన్,
జిటచిటనెగసెన్ దవశిఖి, కటకటగ్రీష్మం బొకింత కనఁబడునంతన్.

బడి చనుదెంచుచాయు ధరఁ బాంథుల తాపముతీర నక్కడ
క్కడఁ దరుజాలమూలములఁ గ్రమ్మచు నిల్వఁగ దానిగ్రుచ్చుకో
వడిఁ గరపాళి యొత్తి దినవల్లభుఁ డల్లన సాఁగె నాఁగ న
య్యెడ నతిదీర్ఘభావము వహించె నహంబు లహోమహోగతిన్.

గీ. అట్టివేసవి బెడిదంపు వెట్టకతన, నేల నందంద విరిసిన నెఱియలందుఁ
దరణిపాదంబు లెడనెడఁ దవుల మెల్లఁ, దివిచికొనిపోవ దివసంబు దీర్ఘమయ్యె.

చ. ఘనతరకీచకోత్కరముఖంబులఁ దగ్గతభోగిఫూత్కృతుల్
దనరఁగ నూఁది యోషధికదంబకచూర్ణముఁ గూర్చి కొండలం
*గనకము సేసెఁ దత్సమయకైతవ సిద్ధుఁడనంగ నెల్లెడం
గనగన మించె నెంతయు నఖండదవాగ్నిశిఖాప్రకాండముల్.

చ. ఖరకిరణోగ్రతాపమునఁ గ్రాఁగి రసాతలభూమి డాఁగిసా
గరములు నింకె నోయనుమఁ గైకొని చూడఁగ వచ్చి పోవుచుం
దిరుగు సవిద్యుదంబువతతిం దలపించఁగ జేసె నయ్యెడన్
ధరణిధరాగ్ర జాగ్రదురుదావ ముఖోద్ధత కీలిధూమముల్.

ఉ. అబ్బలువేసవిన్ ఘనగుహాంతరసీమల రేవగళ్లమైఁ
బ్రిబ్బెడు నుబ్బ నుబ్బఱఁగఁ బాటులు దప్పి మొగంబు లెండఁగా
బెబ్బులు లొక్కపెట్ట నతిభీకరభాంకృతు లాచరించె నా
గుబ్బగఁ గొండ లెండవడఁ గ్రొంకుచుఁ గూఁతలువెట్టె నోయనన్.

క. సుడిగాలి ధూళిఁజుట్టుచు, వడిగా నందంద తిరిగె వలయంబగుచున్
బుడమియును బరణి తెఱ తిరిఁ, గెడుకరణిం జాలె నట్టిగ్రీష్మమునందున్.

గీ. ఊష్మలతమించ నెంతయుఁ గ్రీష్మసాలి, చండమార్తాండ కిరణంపుశాటి మీట
నెండమావులు గదలె నుద్దండ గతుల, మృగకులంబులు గని తృష్ణఁ దగులుకొనఁగ

క. బడిఁ బఱచు నెండమావుల, నడుమ నపుడ కాలి లోఁగనంబడు నుద్య
ద్బడబాగ్నికీలముల గతి, గడుమించెన్ ధాతుపుష్పికానివహంబుల్.

గీ. పడగ సురటుల నప్పటప్పటికిఁ గొంత, పూత్కృతుల వేరి గాడ్పులు పొడముచుండ
బ్రిదుకుఁ గనెఁ గాక భోగు లప్పగిదిఁ గాక, యుండెనే నట్టి వెట్టచే నుడికిపడవె.

---

*ఈధూమవేధిశబ్దవేధులకు :—

ధూమవేధీరసం పిష్ట్వా తేనవస్త్రం ప్రలేపయేత్ తతోజ్యోతిష్మతీతైలే తస్త్వావర్తిం ప్రకల్పయేత్। జ్వలితాం తాం తామ్రశైలే యోజయోత్పత్రతాంగతే। తద్ధూమగంధమాత్రేణ సర్వంభవతి కాంచనం। శబ్దవేధీ రసోయో౽సౌ గులికాంతేన కారయేత్। తత్సర్వంజాయతే స్వర్ణం శ్రుతే శబ్దే నసంశయః। పాషాణవేధకోయో౽సౌ పర్వతానపి తేనవై, వేధయేదగ్నితప్తాని సర్వంభవతి కాంచనం. అని మంథానభైరవుఁడు.—

ఆతతి సలిలం బెందును, బాతాళము ద్రవ్వగానఁబడకుండు గతిఁ
భీతిల్లు యోగిజనులకు, శీతలకుంభకము గలుగ జీవన మొదవెన్.

కమ్మవీడెంపు లేఁగారంబు గలమోవి కండచక్కెరపానకంబు లిచ్చి
చలువతావులు గుల్కు కలికిలేఁబల్కుఁ గప్పింపుఁబల్కులను గర్ణములఁ జొనిపి
జీనిపన్నీరు నించిన యట్టి కుచకుంభ యుగళంబు నక్కున నొత్తి యొత్తి
పాటల సుమసౌరభంబులు వెదచల్లు సొగసుఁబయ్యెదకొంగు సురటి విసరి
రమణు లెంతయుఁ దమతమ రమణులకును, దాపములువాపిరో కొంతతపనుఁ డపుడు
తనదుపండ్రెండుమూర్తు లనెలసినట్లు, కొండలవియంగ గండంపుటెండ గాయ.

క. ఇటు లన్వేసవి యెల్లెడఁ, బొటచొట నిప్పుకలు గలుగుచో నక్కాశీ
పుటభేదనంబు వెలువడి, యటుచనుచు మునీంద్రు లవల నవలద్గతులన్.

మ. తమసానిమ్నగ దాఁటి తజ్జల సముద్యద్బాల శైవాల జా
త మసారద్యుతి తీరభూరుహవిభాధట్టంబు తోఁగూడి సం
తమసానీకముఁ బోలె నద్దెసలు నిండం జూచి యోహో మహా
తమసానీరము నిండెఁ జెల్లనని చింతం జాలబల్కింపుచున్.

సీ. నలువంకలకు డిగ్గి పలువంకలకుఁ జాఱు కొండవంకలు కెలంకులను నిండ
నొండొండఁ దీక్షించు సుంద్రుల చంద్రుల బొరిగొన్న పేరీతపాదలఁ దుపల
జవలంటఁ బెరిగినఁ జాలలోయలచాయ జాళె యల్లిన లీల నందు వెడల
నాఁగినకో.........వలయుంబుఁగొనలోనఁగలయుబలసి
వెదురు ములుబూద్గ ములు రేఁగ వెలగవేము, గలివెయుఁ జెలంగ దిగ్గజకర్ణములను
జెవుడుకొన ఝల్లికాధ్వని జీంద్రమనఁగఁ జీమదూఱని యొకవనసీమఁ గాంచి.

ఆ. మాను లచట వారిమార్గంబు గానక, వెదకివెదకి యల్ల విపినభూమి
పాపటయును బోలెఁ జూపట్టు నొకతప్పు, ద్రోవ వెంట నంటి పోవుచవల.

మ. కని రామానీంద్రచంద్రుల్ ఘనరసవ దస్పృశ్యారణ్యాచుంచు పంచా
నన కోపాటోప చంచన్నఖరకులిశ భిన్న త్రుటత్కుంభిరాట్కుం
భనివేశోన్ముక్త ముక్తాఫల సర విసరోద్భాసి ఝిల్లీమతల్లీ
ధనురాస్ఫాల స్ఫురన్నిధ్వని జనిత మృగీధావనంబున్ వనంబున్.

క. కనుగొని యోహోహో యీ, వనమహిమను లేరికైన వర్ణింపంగా
జను నే యటంచుఁ బలుకుచు మును లందఱు నవ్వనాంతమునన్నంతంతన్.

సీ. తోరణంబులుగ వీథుల నారఁగట్టిన యుప్పగండలకు నొండొండ దిరుగు
పులుగుల ఱెక్కగాడ్పులఁ జాల నెగసెడు పసరంపుఁ బొలకంపు ముసుకొనఁగ

బసివట్టి నలుగడఁ బఱచిన పోకముల పచ్చితోళ్ళను బండ్లఁ గ్రుచ్చి పెఱుకు
బలుజాగిలంబుల భౌభౌరవంబులఁ గొంకి పంకములోన ఘుర్ఘురించి
పసువులిడు నూరపందుల ముటికిగవులు, చేఁపతట్టలఁ గిదురుతోఁ జెనసిచుట్టఁ
గూఁతవెట్టిన జనుల వాకొలుపఁ జేయు, భయముగొల్పెడు నొకబోయపల్లె గాంచి.

క. చుట్టును బసరపుటెముకల, తెట్టులు చూచినను మదికి దిగులయ్యెడు హా
కట్టిఁడి దైవం బిచ్చటి, కెట్టు మనలఁ దెచ్చె దాఁటు టెట్లొకొ యనుచున్.

క. చండాలవాటికయు నిటు, లుండునె యీరోఁత గన్న నొక్కటఁ బేవుల్
గుండెలు నిలువక వాంతికి, నొండరిగెడు కర్మఫల మహో యిటు లుండెన్.

క. నెటి చెదర కిరాతులయుం, దఱనైనం బోవవచ్చు దయచూలినయి
క్రూరుకుఁగిరాతుల ముందఱ, వెఱపక చసఁ బోల దిసట వెఱ వెయ్యదియో.

గీ. అనుచుఁ గరములు మొగముల కడ్డమిడుచుఁ, గోసినటువలె మనసున రోసిరోసి
ప్రాసి యుమియుచు నుడియు దుర్గంధమునకు, నాసికలు మూసికొనుచు సన్యాసివరులు

చ. మిడిమిడియెండ కొట్టునను మేనులు పెట్లుచునుండ నేలపై
నడుగుల దుమ్ము కుమ్ములవలె నంటుకొనన్ వడిఘర్మతోయముల్
జడిగొనఁ గా జటల్ గడవనంబులు మోవఁగ లేక పోవ న
య్యెడ నొకబోయ దాయవలె నెక్కడనుండియొ యద్భుతంబుగన్

క. బడి నేఁగుదెంచి యుఱుమని, పిడుగుంబలె నిప్పు లురులు బెడిదపుఁజూపుల్
గడలను జడిగొనఁ గడువడిఁ బొడమెడు తర్జనల నడవిప్రులుగులు బెగడన్.

చ. కటినటియించు నీలిబలుకాసెయు నల్లని మేనుఁ జిమ్ముఁ జీ
కటి ఘటియింపఁ జేత విలుఁ గైకొని మేఘపుపిల్ల వోలె న
ట్టిటు శరపంక్తులడ్డముగ నేయుచు డాయుచు వచ్చివచ్చి య
జ్జటికులసార్వభౌములను సాఁగఁగ నీ కరికట్టినిల్చుచున్.

క. నిలునిలువుడు మీ చేతం, గలసొమ్ముల నెల్ల నిచ్చి కదలుఁడు నాతోఁ
జలపట్టిన మీయుసు రందఱఁ, బలుచట్టులమీఁద నుతికి పాఱన్ వైతున్.

గీ. అనిన నమ్మునులడికిన నటు కిరాతు, బులుకుపులుకనఁ గనుఁగొని పలుకకున్న
బెదురుఁ జూపిన గాని యేయుడుగ గుడుసు, బాఁపనపిసాచులకు భీతి దోఁపదనుచు.

సీ. తొలువొల్చుఁ గుప్పె గోలలు గొన్ని పైనేసి యవి నెట్టుపడిపోవ నొడుగఱచి
గన్నె రాకుములుకుల్ గొన్ని సూటిగఁ బన్ని యవి పైకిఁ దేల నహంకరించి
యీ వేసు విలుకుల గోరుబంటుగఁ జెంది యవియును వమ్మైన నదరిపదరి

పారావతమ్ములు పదియైదు నిగిడించి యదియును దప్పిపో నాగ్రహించి
యిన్ని నాళ్ళకు నాచేతి యేటు దప్పె, నౌర యీజడదారుల కంపతప్ప •
గలదు గాఁబోలు ననుచును గఱకు దుఱుకుఁ జూపులదరంగ నటువాని చుట్టువారి.

సీ. జడలచుట్టకు బిర్చి మెడలపై మోచేత గుప్పగుప్పన సారెగుమికిగుమికి
కక్షపాలలు వించి రక్షకేలను ముంచి జడియఁగ మొగములఁ జల్లి చల్లి
సలిలంబు గళగళ తలలమీఁదటఁ బోసి బుఱ్ఱకాయల నెత్తి పొడిచిపొడిచి
కడవసంబుల రెమ్మ పెడమర్లు గాఁ జుట్టి గూనువోనడిపిపుఁ గొట్టికొట్టి
యిట్లు బాధించి శోధించి యెందు నొక్క, పచ్చపైకంబు గానక పచ్చిబోయ
నేఁటి తెరవాటు పనలేక దాటిపోయె, ననుచు వెనవారి పిసమాని యవలికేఁగి.

గీ. వింటికొప్పనఁ జేయూది విన్నఁబోయి యుసురుసురటంచుఁ గలఁగుచున్న వాని
చంద మీక్షించి యప్పు డాశాంతమతులు మునులు పలికిరి చేసాఁచి మనికితమన.

గీ. తాపసుల మమ్ముఁ బసుల చందమునఁ గొట్టఁ, జేతులెట్లాడె నిదియేమి చేటు నీకు
బాతకుఁడు గాగ నెన్నాళ్లు బ్రతికెదీవు, రాతఁ జేసిరె యోరి కిరాత నిన్ను.

క. ఇటమునుపు నీవు చేసిన, పటుసాహసములకు నెల్ల ఫలమగు నోయీ
జటివరుల నిటుల గొట్టితి, కటకట యింకనైన దురితగతి మానవు గా.

క. ప్రాయము జలకల్లోల, ప్రాయము కాయంబునస్థిరం బిందులకై
రోయక దురితమెతపమని, పాయక చేసెదవు నిందపరఁగఁ బుళిందా.

వ. అని నాలుబ్ధకుం డతిశుద్ధస్వభావుల సల్లాపయోగంబున నుల్లంబునం గొంత శాంతి పల్లవింప వారల కిట్లనియె.

గీ. చేలదపసులార యాలిబిడ్డలకుఁ గా, గాఁక నావటించ గాన విడిసి
విల్లు నంపకోల లెల్లను గైకొని, యున్న నాకుఁ బాపమొదవు టెట్లు.

వ. అనిన నత్తాపసాగ్రణు లెట్లైన వీని ననుగ్రహింపవలయు నని మఱియు నిట్లనిరి.

క. ఓరోరి నీవు సేసిన, ఘోరపుఁ బాపములు నీవుఁ గొడుకులు నాలుం
జేరఁ బడి పంచికొందురో, వానికిఁ బనిలేక నీక వచ్చునో చెపుమా.

క. అన విని వారి ముఖాలో, కనమున జ్ఞానంబు వొడమఁగా శబరుం డో
మునులార యిత్తెఱంగా, లిని బిడ్డల గొబ్బున దెలిసి యేవత్తున్.

క. అదె పల్లె దవ్వు లేదిటు, కదలకుఁ డేవచ్చుదనుకఁ గాదని యవలం
గదలిన నాలాగు నెఱుం, గుమురే కదయంచుఁ బలికి గొబ్బున జనియెన్.

మ. వనిమార్గంబున నేణవర్గముల నేఁచం బోక లక్షించి ప
క్షినికాయంబులఁ గొట్టఁగోరక మదిం జింతాభరం బెంతయుం
ఘనమై యొక్కఁగఁ బక్కణంబునకు వేగంబోయి యేచక్కఁ జ
క్కని తాటింటికి నేఁగి ప్రేకమగు కాఁకన్ వెచ్చగా నూర్చుచున్.

క. విలునమ్ములు నటువైచుచు, నలనత నొక జింకతోలునందునఁ గూర్చుం
డిలఁ బ్రాయుచుఁ దనపాపముఁ దలపోయుచు నెమ్మనమునఁ దల్లడపడుచున్.

చ. కుదురుగ జంగసాఁచి చనుగుబ్బలు మీటుగఁ బాలుటాకుఁ బ
య్యెద పాదలంగ నెన్నుదురొకింత చెమర్పఁగ మేచకాళి నే
ర్పవొరలఁ బాడి చందనపు రోలున నేనుఁగుఁ గొమ్మురోఁకటన్
బ్రిదిలెడుకొప్పుతో వెదురుబియ్యము గుప్పనిజప్రియాంగనన్.

క. రావే యనిపిలచిన నది, వేవేగన్ వదలు కొప్పు విప్పను జన్నం
గ్రేవల వలగొను కెంపుం, దావడముల యొప్పుఁ జొప్పొదవఁజను దెంచెన్.

వ. ఇట్లుచనుదెంచి న యయ్యంగనం గనుంగొని యుక్కిరాతుండు.

క. ఓపడఁతి తాన్నొనర్చిన, పాపంబులు దలఁప నీకుఁ బనిగలదో నా
కేపనియొ కాక చెఱిసగ, మైపరఁగునొ నాకుఁ దాఁచ కంతయుఁ జెపుమా.

క. అనవిని యచ్చెలి నగుచు, న్వినునాయక తలఁప నాకు నీదగు పాపం
బునకుఁ బనిలేదు నీపొత్తి, పుర నెంతయుఁ గుడిచి కట్టి పొనఁగుట కన్నన్

చ. ఖవుళ్లగు వారికెవ్వరికతంబున నీవెర వప్పుదీసి తె
త్తువో కొనితెత్తువో తెరువుదోఁచుచుఁ దెత్తువో జూదమాడి తె
త్తువో చనితెత్తువో యదియుం దోనమొ పుణ్యమొ నాకు నేటి కా
తపరవ నీవు దెచ్చినవి దాఁచక వండఁగఁబాడి నిచ్చలున్.

క. అనవిని మనస్సు చివుకురు, మనఁ గొడుకులఁ బిలిచి యట్ల యడిగిన వారుం
జనని పలికినటు పల్కిన, విని యచ్చెరు వంది చాల వెడవెడ నగుచున్.

గీ. మోసపోయితిఁనిన్నాళ్ళు నాసఁదగిలి యాలుబిడ్డలుఁ దానుఁ జుట్టా లనంగ
నెవ్వ రెవ్వారలే యూరకేదికోవ, వీరికేఁ బాటువడు కెల్లవృథయయనుచు

క. దోనమునకు బనిలేదట, నాసొమ్ములు వీరికిం దినంబని గలదే
కోసితి నంసారముఁ దెగఁ, గోసితి మొదలంట బందుగుల తగులెల్లన్.

వ. అనితలంచి యన్నిషాదుండు సన్యస్తసమస్తసంసారుండగుచు నానాసుకృతవాసనా
విలసితంబగు ననూనజ్ఞానామృతాపాదనంబున మోసంబు నొందుచుఁ బుత్రమిత్ర

కళత్రాదిసంగమంబు తొఱంగి క్రమ్మఱ నమ్మునులపాలికిం జని యఖండదండ వందనంబులు గావించి యంజలిపుటఘటితనిటలతటుండగుచుఁ దచ్చరణరేణుస్పర్శనంబునం బాటిల్లు వాక్పాటవంబున నోమునీంద్రులారా సకలకలికల్మషంబగు మీసందర్శనంబునం గృతార్థుండనైతి నాజననంబు సఫలంబయ్యె నాజవంజవభంజన స్వతంత్రంబగు నొక్కమంత్రంబు నాకు నుపదేశింపుఁ డనుచు సంతసంబునం బునఃపునఃప్రణామంబులాచరించిన నవ్వాచంయములు న్వనేచరుని సమీచీనధీచాతుర్యంబునకు నాశ్చర్యంబు నొందుచు మున్ను వీఁడెన్నితపంబులు సలిపెనో యాటవికుండయ్యు సత్కార్యంబు వాటింపం దలంచె నెంతటి ధన్యుఁడని సంతసించి సర్వవర్ణసాధారణంబును నిఖిలమంత్రఫలదంబును లోకాపారదోషరహితంబును దేశకాలనియమానుపేతంబును సత్యకామంబును శ్రీశ్యభిరామంబును మనుసార్వభౌమంబును నగు రామనామంబు కాని వీనిం బవిత్రుం జేయు వేఱొకయుపాయంబు లేదనియు నేతాదృశులకుఁ బ్రతిలోమంబుగా నుపదేశింపవలయు నని విచారించి యాదండ నొక్కతీర్థకుండంబున నక్కిరాతు సుస్నాతుఁ గావించి సంభావించి.

పం. కిరాత రాఁ దలంపు హత్తి కేవలంబు భక్తిమై
మరామరా యటంచుఁ బల్కు మా యనుగ్రహంబునం
బరాకు రాదటంచు రామమంత్రమిచ్చి యంతటన్
ధరాధరాధిభూవిభూతి దర్శనాభిలాషులై.

క. చని రవ్వలనమ్మునులును, వనచరుఁడును వారి బుద్ధివదలక మదిలో
ననుదినము కందమూలా, శన మొనరించుచును నితరసంగరహితుఁడై.

సీ. నుదుట జేగురుబొట్టు పదనింకఁ గాదని తులసిమృత్తిక నూర్ధ్వతిలకమిడియె
పెలసువిల్లు వహించు కెలసంబు గాదని వేణుకుండిక యొండుపాణిఁ బూనె
సొగసున్న నికోర సిగయూటి గాదని సిడుద పెన్నెరులెల్ల జడలుదాల్చె
*నిండుగాటపునీలి దిండు గాదని కటిఁ బలుచనినారచీరలు ధరించె
దినము తమసాతరంగిణీ తీర్థమునను, స్నానమొనరించి యత్యంత శాంతి మెఱయ
మౌనులుపదేశమిచ్చిన మంత్రమెపుడుఁ, దపము సేయుచు నక్కిరాతప్రభుండు.

క. ఈసరణి వాఁడు సకల, వ్యాసంగము మాని మానివర్తన నుండన్
వేసట చెవిఁ డెక్కుడఁ గాసింబడె ననుచు వాలికలవారెల్లన్.

---

*నీలిదిండు "ఘాయిదళనీలిదిండ్లోలికి బూషిదముండుల బంతి" దశ. ౫-౫ (తా ళ-౧౩౧౬.)

క. చెట్టుల పట్టుల గట్టుల, చుట్టుల నందంద వెదకి సొలయుచు నొకచో
నట్టడవిలోనఁ గదలక, చుట్టుంబలె నున్నవాని చందముఁ గనుచున్.

క. నట్టడవిఁ జట్టుకొడుకై కట్టెదుటన్ మనమునిలువఁ గా జూడఁడు తా
నిట్టిటు బొంపనసత్యము, వట్టెనో యీరావినుండి బాపురెపీనిన్.

క. ఇత్యడవి వీని నేబలు, దయ్యంబులు వేసెనొక్కొ తరలకయుండన్
డత్యఁ డొకింతయు మనలోఁ గుయ్యవఁనొల్లండు కన్నుఁగొనతెఱవంగన్.

సీ. నెమ్మిసింపెచుపండ గ్రిమ్మి చుట్టెడుకొప్పు జడలుదాల్చుట కిట్టు గడలుకొనెనె
పచ్చికస్తురిబొట్టు పనమీఱు నెన్నొసల్ సుద్దరేకలచుక్క దిద్దఁబడెనె
తడవిల్లొకప్పుడు విడువనిచేతుల మోడుచూపెడునట్టి ముట్టుగనెనె
యడవిలోఁగడువడి యుడుఁగని యడుగులు గదలక యీచాయఁ గుదురుకొనెనె
యకట చెడి వీని నెవ్వఁడో యంకకాఁడు, తప్పుసుద్దుల బుద్ధులు తగులుకొలిపి
బోయజాతికి వెలిగాఁగఁ బాయఁజేసి, నాలుబిడ్డలుమనుములు నలియఁజేసె.

వ. అనివానిం జేరుకొని యందఱు మఱియునిట్లనిరి.

ఉ. దాయలుగూడి యెవ్వరు వితా నినుమాతలఁగాకయుండ నీ
మ్మాతలు పన్నిరింతచలమా తలమానిసి వింటవింట నీ
వేతుఁగ నేరవో మలలనేయెడలం దిరుగాడ నేరవో
బోయతనంబు వీఱేడిన పోయెఁగదా మగవానివమ్మెగన్.

క. సాము దిగవిడిచి యొడలిటు, సాముగ నట్టడవి నిదుర నవిమాని యయౌ
జాము దిగఁగాళ్ళు నెనిమిది, జాములు నిటులుండ మనదు జాతికిఁ దగునే

సీ. కన్నులుదెఱవని గండభేరుండంపు నిసువుల నెవ్వరు నేర్తురరయ
నేనుంగుతల పాలనెవ్వరు దెత్తురు పెంచినసింగంపు పిల్లలకును
కవిసినదొడ్డిలోఁ గాటెను పెంటుల దట్టించి యెవ్వారు గట్టఁగలరు
పులులకూనలకు రేపును మాపుఁ దగునట్టి మేపులెవ్వరు దెచ్చి మేపువారు
ఇంటనీవటు శ్రీకున్న నిట్టిపనులు, కుఱుచబుడుతలచేనానె కొలమువారు
చాలసెగ్గింప నాకముచాతినుదుట, నుదుటుతనమెల్లమాని యిట్లుండదగునె.

ఉ. కానకు నేఁగి వింతరుచిఁగ్గిన పిట్టలుఁ జెట్టు జున్నులున్
దేనెలు చారపప్పులును దెచ్చుఁగదా యిఁకనంచు గూళ్ళలో
గూనలు వోని నీకొడుకుఁ గజ్జలు నీచను దెంచుత్రోవఁ జూ
ప్రాణఁగ నిల్తురయ్యెడలు హా మముఁ బోంట్లకుఁ జూడవచ్చునే.

క. గువ్వకఱకుట్లు మేకముల, క్రొవ్వుల బొరుగులును గుసుగుసు లేయుటయు
న్నివ్వరికూడునునింటం, బువ్వంబునఁ గుఱువకట్లు పాకొండగునే.

ఉ. బోయమిటారిగుబ్బెతలు పున్నమవెన్నెల పైటనీపయిం
బాయనిబాతి కిన్నరలు మాటికి మీటుచు నీపరితాపమున్
హాయని చొక్కిపాడ వినవా కనవా మఱవాఱఁ బాసి నీ
వీయెడ నొంటినుండఁ దగవే తగవే చనుదెమ్ము పీటికిన్.

సీ. కులుకుగుబ్బలతోనె కురువిందపేరులు గునియుచుఁ బెనఁగొని గొల్లిఁజూప
దంతంపుఁగమ్మల తళుకులుపలచని చెక్కుటద్దంబులఁ జికిలిసేయఁ
బగడలరతనాలు బవిరులుపికిలి పూదండ కొండొండఁ గైదండయొసఁగఁ
గదలుఁగొప్పునఁజుట్టుఁ జెదరిపాఱెడు మల్లె మొగ్గలు తెలినిగ్గు ముగ్గులిడఁగ
నడవిదడవిల్లుఁ గైకొనియమ్ముఁ దొడిగి, పొంచి మైవంచి నినురెచ్చరించి మంచి
మేకముఁబడనేసి నిచ్చలు మెచ్చఁజేయు, నట్టి నాయకుగాలిఁ బాయంగఁదగునె.

సీ. దుప్పులఁబడనేసి యుప్పుఁగండలుచేసి, చప్పరింపుచునుండుఁ జవులుమఱచి
మదహస్తినదలించి యదిహత్తిరాఁబొంచి యెదనాటుకొననేయు నేటుఁదుడిచి
పచ్చికస్తురిమేన హెచ్చువాసన లీనరంగు లేయుచునుండు రహిదొఱంగి
మింటిమ్రాకులవంటియంటి మ్రాకులువ్రాకి జుంటితేనెలుగ్రోలు సొంపుమాని
నారచీరలుగట్టి యన్నంబుదట్టి, గాలిమెసవుచు నాతిపైబాళి లేక
జపము వ్రేళ్ళను నెన్నుచు జాతివిడిచి, బాపలనుగూడియుండుట బాతియగునె.

గీ. తెల్లవారిన గుండగ్గి కోళ్ళలీల, నీళ్ళమునుఁగుచు నొడలెల్లఁ దెల్లఁబాఱె
నిట్టిప్రాసంబులనుగూడి నెవ్వఁదొడరు, వెడగుబాపన తగులునఁబడితి వేల.

క. పతిచెడ్డబీదబాపని, గతి నిట్లుండంగఁదగునె కటకటమదినీ
వెతనెంచవు మనకులమగు, మతమెంచ వొకింతరాతమఱచిరొనిన్నున్.

వ. అని యివ్విధంబున నావ్యాధులెల్ల మహావ్యాధులుంబోలె బాధింపఁ జయ్యన సా
ధారణాగాధ బోధైకనిధానుండగు శబరనాథుండును.

క. కనుఁదెఱచి నవ్వి యేమియుఁ, బనిలేదనిముందుమీఁదు పలికితిరిపుడే
పనికిటువచ్చితి రిందఱుఁ, జనుఁడెఱుఁగుదు మీఁదుమాయ జరగునెయింకన్.

గీ. తండ్రిరాముఁడు జనకజతల్లియెల్ల, బంధులును నాకునాస్వామిభక్తులెన్న
నింతవాఁడను నాకిందు నెదురుగలదె, సకలజగములు నేలుదుసుకరముగను.

క. మీరెవ్వరు మేమెవ్వరు, నేరము లెంచక ధనుంబు నిలువకయెటకే
శ్రీరఘుపతియే నాకు న, కారణ బంధుండు గురుఁడు గణుతింపంగన్.

క. కటకట జననంబులు వే, రటగుణకర్మాదికంబు లఖిలంబులు వే
రట చనియెడుత్రోవలు వే, రట యిదియటమటిపుఁగూట మనికనవలదా.

క. సతులెవ్వరు సుతులెవ్వరు, హితులెవ్వారేటి వఱద నెందే నొకచో
జతగూడిన కాష్ఠంబుల, గతినించుక గూడివిచ్చి కదలుదురవలన్.

క. అనియాశ విరుగనాడిన, వినియందఱుఁ జనిరి జూతవేసినగతి న
వ్వనచరుఁడు నంత నంత, ర్ఘనతర బోధావధాన రంజితుఁడగుచున్.

సీ. సరసిజాకరముల నరసిపద్మాక్షుముల్ పరిపక్వముగ నేర్పఱిచి తెచ్చి
పురుషయోగ్యములైన పూసలు వరికించి ముఖములు ముఖముల మొనయఁజేసి
పరభాగములతో నపరభాగములనుంచి నడుమ మేరువుగ రెండిడి యమర్చి
యంతరంబున గ్రంథు లమరసూత్రంబున నూటయెనిమిదియుఁ బొందువడఁగ్రుచ్చి
యట్టియక్షుసరంబుఁ జేపట్టితనకు, మానులిచ్చిన యదిగాక మానసమునఁ
దలఁచి యంగుష్ఠికాద్యంగుళులను మేరు, పదము దాఁటక త్రిప్పిజపంబుఁజేసె.

సీ. దినము మరామరా యని పల్కినంతంతయది రామనామ పర్యాయమయ్యె
నారామనామ జపానుభావంబున నంతర్ముఖతఁ జూడ నల్ల నల్ల
నల్లనిమొగులొండు నానాఁటఁ గనుపించె నదియుఁ గోదండకాండాంకితమగు
సగుణభావముఁ జెందె సగుణరూపంబెల్ల రూపింప నిర్గుణ రూపమగుచుఁ
గోటిరవిచంద్ర తేజమై కొమరుమిగిలి, నట్టితేజంబునందును నంతరంగ
మిట్టటు చలింప నీయక గట్టిగాఁగఁ, బూదెగఱఁగినగతి నేకముగ ఘటించె

క. అత్తేజంబున నెంతయుఁ, జిత్తమలయ నంతఁ గాయసిద్ధి మెఱయఁగా
హృత్తామరసమె సూచుచు, నుత్తమయోగులనుతింపనుండె నచలుఁడై.

వ. అని చెప్పిన విని యమ్మునిపుంగవులనంతరకథావృత్తాంతం బడుగుటయును.

శా. ఉద్దండానల చండకోపన సుబాహూచ్చండ దోర్దండ భూ
భృద్దంభోళి శిలీముఖక్షపిత మారీచజ్వలద్ధామ వి
ద్యుద్ధామస్ఫురదాశుగా కులితి పాథోరాశి గర్వోచ్ఛ్రయా
యుద్ధామద్యుమణిద్యుతిప్రతినిధి ప్రోద్యత్ప్రతాపోదయా.

క. సుగ్రీవ భరణగుణ సా, మగ్రీ హరిదంతకాంత మానితకీర్తి
విగ్రీకృతశూర్పణఖా, వ్యగ్రీభవదమర వైరి హరణవిహరణా.

మాలిని. చిరమునీశ హృదయదేశ చిత్ప్రకాశరూప వి
స్ఫురణగణ్య జనశరణ్య భువనపుణ్యశోభనా
కరవిహార యమృతహార కలితసారకీర్తి సం
భరణలోల దిగధిపాల భణితశీల ఖేలనా!

గద్యము. ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వతవిశేష నిరర్గళ వాగ్వైభవాశేష సరస సాహిత్యకళాభోజ సత్యసంభాషిత ముఖాంభోజ సకలసామ్రాజ్యధౌరేయ నిత్యవితీర్ణిధారా రాధేయ నిరతావారితాన్నసత్ర సంతోషితప్రతిదివస పంచాశత్సహస్రభూసుర బహువారావర్తిత మహాదానవైభవావర్తితకీర్తి భాసుర నిజనామాంకితాకలంక వస్తుసమగ్ర బహుశాగ్రహారభూషిత చోళధారామండల నిఖిలభోగవిభవనిర్జితాఖండల సాధితసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప నేపాళభూపాలస్థాపనాచార్య కర్ణాటరాజపూజనీయధౌరంధర్య రామసేతు శ్రీరంగవిజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్ర సర్వజనసంభావిత గాంభీర్యముద్రావినిర్జితసముద్ర సదాశ్రితభరణ దీక్షాదక్ష దక్షిణసింహాసనాధ్యక్ష రాజాధిరాజసన్నుతాసాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనక సతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూథ భువనశోభితగుణసనాథ బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంత విమోచనశ్లాఘనీయ బాహాబల మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల చినచెవ్వనృపాలపుత్ర సజ్జనస్తోత్రపాత్ర రూపరేఖావిజితకుసుమసాయక సకలధర్మసంధాసంధాయక రఘునాథనాయకప్రణీతంబైన వాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

——(§)——

శ్రీరస్తు.

# వాల్మీకి చరిత్రము.



## (తృతీయాశ్వాసము.)

క. శ్రీజనకనందనావ, క్షోజపత్రవిలిప్తమసృణఘుసృణక్షోద
భ్రాజితబాహాభ్యంతర, రాజనయకలాకలాప రఘుకులదీపా!

వ. అవధరింపు మప్పర్వతుం డమ్మునుల కిట్లనియె. నవ్విధంబున నాశబరనాథుండు.

క. బాలుని లీలన్మిత్రుని, పోలికని తరంబు బుద్ధిం బొందమక యతండు
ద్వేలాత్మానందస్థిర, శీలుండై ఘోరతపము సేయుచు నుండెన్.

క. అతని శిరంబున నీవృతి, హాతపటురవవహ్నిజాల మద్భుతధూమ
ప్రతతులతో నుత్థితమై, యతర్కితోపప్లవంబు నడరం జేసెన్.

చ. ఉగమునవంబయంచుజను లులములంగడుందల్లడంబులం
బొగులంగఁ గొన్ని దిక్కులఁ గపోతకపోతసమూహధూమ్రమై
పొగయుచుఁ గొన్ని దిక్కులఁ బ్రభూతశిఖాచయమంటమింటిపై
నెగయుచునన్ని లోకములు నేర్చెఁ దదీయతపోగ్ని మిక్కిలిన్.

క. గుజగుజలాడుచు వెడలిరి, గజగజ వడఁకుచును మౌని గంధర్వాదుల్
నిజవసతులు తద్ధూమ, ధ్వజకీలవ్రజము లెన్నివంకలఁ బర్వన్

క. ఇక్కరణిఁ తత్తపోరణిఁ, బిక్కటిలిన వహ్ని లోకభీకరమగుచున్
గ్రుక్కిన దివికెక్కిన మదిఁ, బొక్కి పురందరుఁడు బ్రహ్మపుత్త్రునితోడన్.

ఉ. చిత్తజవైరి ఫాలశిఖిచే జగమెల్లను వెచ్చఁ జూచెనో?
యిత్తెఅగంటి పట్టమున కేనిటు లుండక యుండనెప్పుడే
నెత్తులువెట్టునో మఱియు నేరత్నమో వివరింపు మయ్య నా
కిత్తెఱఁ గంతయుం గృతరమేశ్వరవందన బ్రహ్మనందనా.

క. అన విని నారదుండు మది నారసి యిట్లనెనో సురేంద్ర భూ
మిని దమసానదీతటిసమిద్ధవిశుద్ధగుణప్రసిద్ధుఁడౌ
వనచరుఁ డొక్కరుండు రఘువల్లభుఁ గూర్చి తపంబు సేయుచుం
డ నతని వేఁడి మిట్లు భువనంబులఁ బొక్కఁగఁ జేసె నెంతయున్.

వ. అక్కిరాతవరుం డనారతసీతారమణస్మరణపరిభావంబునం జెంది యపిందితౌచా
రుం డగుచు నరవిందభవాదిపదంబు లతితుచ్ఛంబులుగా నెఱింగియితరేచ్ఛఁ దొ
ఱంగి స్వచ్ఛతరస్వచ్ఛంద పరమానందభూయంబును, సకలచ్ఛందోభిధేయంబును,
మునిభాగధేయంబును, భక్తజన విధేయంబును, రామ నామధేయంబును, నగు నొ
క్కరూపధేయంబు నిరంతరధ్యేయంబనితలంపుచున్నవాఁడతనివలన నీకు భయం
బు లేదు పురందరా! అని పిలిచి డెందంబునఁ జేయిడి సుఖంబున నుండు మనిన
నొక్కింత ప్రసన్నముఖుం డగుచు శతముఖుం డమ్మునిశేఖరుం గనుంగొని.

సీ. నముచిజంభవిజృంభణము చించి మించినకతలు వ్రాసిన భిత్తికలు సెలంగ
సంతానమంజరీసంతానములు గూర్చి కనుపట్టు పట్టు మేల్కట్టులమర
గంధర్వభామినీగాంధర్వసంగతి ఘుమ్మను పసిఁడిటంకులు వోసంగ
కడలలోకములు నిల్కడలు గన్గొన, వచ్చు రమణీయమణిజాలకమ్ములు దనర
నిర్మలప్రభ మీఱు సుధర్మయందుఁ, జుట్టు నుచితాసనంబుల సురలు మునులు
గ్రిమ్ముకొని కొల్వఘనవైభవమ్ము మెఱయ నిండుకొలువున నుండియాఖండలుండు

ఉ. కన్నులపండువౌ నొక యగారములో రతనాల మేడయో
రన్నను గెంపు టంచు నెలజాల మెఱుంగు టరుంగుమీఁదఁ దా
నన్నలకూబరుండును మనోహరలీలల నెత్తు మాడితే
పన్నిద మంచుఁ బంతములు వల్కుచు నుండెడు రంభఁ జూచుచున్.

గీ. నిండుకొలువుండి యమరవిభుండు నన్నుఁ బిలిచి తెమ్మనె రమ్మని పలుక రంభ
రమణుకై దండగొనియొయ్యారంబుమీఱ జగతివేల్మిడిగైసేసిసఖులుగొలువ.

సీ. నునుముత్తియపుతీవ పనికుట్టు కనపట్టు పట్టుచనకట్టు సంభ్రమముఁజూప
నిండు చందురుకావి నెరికెచే రంగారు కడవన్నె బంగారు కాసెయొసఁగ
వలిచుట్టి పూఁదండ వెలిచుట్టు గనవొప్పు కప్పు చిప్పిలు సాముకొప్పు దనర
ఝుళ ఝుళం ఝుళనాద హాళ హాళితంబైన బిరుదు వజ్రపు జల్లి పెండెమమర
మాటికిని మ్రోల జయడిండిమంబు మొరయ
రయము భయమును నయమును బ్రియమునమర

నమరవల్లభు కొలువున కరుగుదెంచె
రంభ సన్నుత నాట్య సంరంభ యగుచు.

వ. ఇట్లరుగుదెంచి.

క. అమరీ జనకర చాలిత, చమరీ వాలా నిలాభి చంచల ద్వలక
భ్రమరీ సంయుతుఁడై వి, భ్రమ రీతి చెలంగ హరి విరాజిలుచుండన్.

క. కనుగొని సమ్ముఖమునకుం, జనకటు లేతెంచి వచ్చి సవినయ గతులన్
మునులోచన రుచి వీచిక, ల నీలములు వడసి చుట్టులన్ వైచితగన్.

క. కర కంకణ నిక్వణములు, బెరయఁగ దగ మ్రొక్కి లేచి పిఱిఁదికిఁ జని ని
ర్జర వల్లభు ముందఱఁ జం, దురుకావి చెఱంగుకప్పుతో నటునిల్చెన్.

క. నిలిచినఁ గనుఁగొని సురపతి, పలికెం గమలాస్యలాస్య పరిచితి నీకుం
దులతే రెచ్చట నచ్చర, చెలువలలో నిది జగత్ప్రసిద్ధము సుమ్మా.

క. అటుఁగన ఘనకార్యమ్మొ, క్కటి గలిగిన విపుడు నీవు గడగి మనోభూ
పటుశరలక్షణమగు నీ, కటాక్ష వీక్షణము చేత గాఁ జేయదగున్.

చ. అన విని రంభ జంభరిపు నాననముం గని స్వామి నన్ను జే
సిన బహుమాన మేమనుచుఁ జెప్పగ నవ్వి సమస్త దిక్పతుల్.
విని మది మెచ్చిరయ్య పదివేలు విధంబుల నట్టి నన్ను నీ
సొనరఁగ దిట్టినట్టి యలయూర్వశి గర్వము నొంచిరందఱున్.

క. మొన్నటి యుత్సాహము నే, డున్నందుది నీప్రతాప మూఁతగఁ గొని యే
న్నెన్నంగఁ గార్యములు కను, సన్ననె ఘటియింపలేనె జగములు మెచ్చన్.

గీ. అన్న మీరు నాకు మన్నించి యిచ్చిన, బిరుదుఁ బూని యమరులరుదుపడగ
గేళిలోనఁ జొచ్చి యేరాఁగ నూర్వశి, యూర్వశిథిలభావగర్వయగుచు.

క. బిరుదెవ్వరిచ్చిరే యా, దొరకు నీకు నిక గిర్తి దొరకుంగద నా
సరిపాత్రవె నీకెక్కడి, బిరుదని యెన్నుకొని నన్నుఁ జేరొకని తిట్టెన్.

గీ. కొలువులో బిరుదుకాసెను నిలిచి లాస్య, కళలఁ గల మేలు చూపంగవలయుఁ గాక
వాకలదటంచు నెన్నెనివదరుచుండ, శిక్షఁ జేయక యూంట యుపేక్ష గాదె.

చ. భయమతియా డెవెండియు సభన్నను భంగ మొనర్తు నీపయిన్
దయగల యట్టి యర్ధపతి వందనుఁడుం దలవంచ నంచులోఁ
బ్రియపడి యిండ్లనున్న దొరబిడ్డల నాడుదురే సురేంద్ర యీ
పయి మఱి యేమినచ్చునో యుపాయము నేరఁగరాదు పిమ్మటన్.

గీ. కలవి లేనివి దొరసమ్ముఖమునగలద, టంచు బలుకంగ వచ్చునె యమరనాథ
హరిణియనియెడు తామరసాక్షి సాక్షి, నిలిచియున్నది యదియెల్లఁ దెలిసికొనుచు.

క. లాలించి స్వామిబిరుదులు, పాలించితిరనుచు నపుడె వదరక యుంటిన్.
వాళించి విడుతుగర్వము, చాలించి సనంగదాని సరివారునగన్.

క. అని యిట్లు రంభయూర్వశి, దనునాడిన పలుకులెల్లఁ దప్పక యుండన్
మునుకొని చెప్పినదంతయు, విని వెడవెడనవ్వి యమర విభుఁడవ్వేళన్.

క. ఔరాయూర్వశి గర్వము, బీరము రంభకును మెచ్చి బిరుదిచ్చుటయే
నేరమె విద్యలు దెలియన్, నేరమె తనయాట నేర్పు నేడేర్పరుతున్.

వ, అని పలికి యూర్వశినిచటికి దోడ్కొని రమ్మని వేత్రహస్తులంబనుపవారును జని యొక్క హరినీలసౌధవీధికాంతరాళంబున నతివిశాలంబగు శ్రీమకూటంబున నచ్చర చెలుల కూటంబునకు నొజ్జయై నటనపాటవంబులుగరపు నత్తెఱవం గనుంగొని నేఁడు నిండోలగంబైయాఖండలుండు నృత్తప్రసంగంబు సేయుచు నిన్ను బిలువనంపెనని న నమ్మత్తకాశినియు నాననంబు ప్రకాశించ నేఁడు రంభాగర్వభంగంబును నేఁడు మదీయనాట్యవిజృంభణంబును నేర్పడుఁగదాయనుచును గైసేసియుల్లంబున.

సీ. వలరాజు మదదంతి తలమాళిగయనంగఁ గలికిచన్నులఁ బట్టుకంచెలలర
రతిచేతిజీనిసురఁటి యానిదియనంగఁ గళుకుబంగరువ్రాఁత కాసెమెఱయ
శృంగారఫణిఫణా భంగిఁదాయెతుచుట్టఁ గప్పుమీఱెడుసాము కొప్పుదనర
నంఘ్రిపద్మముచుట్టు నతివలయంబుగా నీలాలసరపణుల్ నీటునూపఁ
బసిఁడితీఁగెకునార్చిన పటికవోలెఁ, జిటులుగందంబు నెమ్మేన జిగిదొలంక
నృత్తవేషంబుమిక్కిలి బిత్తరింప, వచ్చెనూర్వశి సకియ లిర్వంకఁగొలువ.

ఉ. వచ్చిజోహారుసేసి నిలువన్ సురనాథుఁడు చూచిరంభతో
మచ్చరమేటికిన్ బిరుదుమాటలకుం బనియేమి నీకునీ
పెచ్చులువల్కనేల నినుఁబెంచినతండ్రికిఁ గీర్తిమిక్కిలిం
దెచ్చితి విద్యగల్గుటకుఁ దిట్టుటయే ఫలమింత చాలదే.

క. అనియిటు నింద్రుఁడు పలికిన, విని యూర్వశి కేలుమొగిచి వినయంబుననో
ఘనవాహన; యెదురాడం, జనదైనను విన్నవింతు సర్వజ్ఞనిధీ.

క. ఇన్నాళ్ళునన్నుమిక్కిలి, మన్ననఁగావించి చాల మంచిననీవే
కన్నడుగుసేసితేమని, విన్నపమొనరింతునీకు విబుధాధిపతీ !

క. నాకాధిప; యిటురంభన్, నాకుంబ్రీతి సేయుటకు మనంబలరెఁ దగున్
లోకమున రెండుగల్గినఁ, గాకరయఁగ నొకటిమేలు గానందగునే

ఉ. ఏలినవారు మెచ్చి బిరుదిచ్చినవార్తలు విన్నదాననై
తాళితిఁగాక తాబిరుదుఁబాల్చితినంచు వహించె నొక్క— నా
వేళ నెయందఱుంగనఁగవే బిరుదుల్ తెగఁగోసి దానిచే
వ్రేలఁగనీడిపించికొని వత్తుజుమీ యిటకున్ సురోత్తమా.

సీ. శివుఁడొక్క— నాఁడు దేశికి మెచ్చి నాకిచ్చెఁ బెద్దవజ్రపుఁగుచ్చు బిరుదురవికె
నాతండ్రిహరి యభినయము మేలనియిచ్చె హరినీలముల కడియాలజోడు
చతురాననుఁడు సరస్వతియు గానము మెచ్చి యొసఁగిరంచలయంచుఁ బసిఁడికాసె
విత్తాధిపతి తాళ విజ్ఞానమరసి ప్రేమఁజెలంగి యుభయచామరములిచ్చె
నెన్నియేనియుఁ గలవని యెన్నిచూడ, బెట్టెఁ బెట్టెఁడుబిరుదులు గట్టిపెట్టి
యున్నయవి వాని నేఁజూడ నొక్క— నాఁడు, బిరుదులేటికి విద్యయే బిరుదుగాదా.

గీ. నాట్యసంగీతకళల నెన్నంగనన్ను, రంభవోలుట యెంతమూరంబు దలఁప
దేవకులనాథ నాయొద్దదిద్దువడిన, పొలఁతియెన్నటికినినన్నుఁ బోలగలదె.

గీ. తారతమ్యమ్మెఱుంగని వారివద్ద, నుండుకంటెను నడవులఁ గొండలందు
నాకునలములు దిని యల్ల హరునినైన, మురహరుని నైనఁ గొల్చుట ముఖ్యవృత్తి

క. వాసవ; నాట్యంబున, వాసియెఱింగియును నన్ను వంచనజేతన్
గాసింబడఁజేసిన నది, నీసర్వజ్ఞతకె కొఱఁతె నిలుచుంజుమ్మీ

క. ఇదె దట్టిగట్టుకొని మీ, యెదుటన్నిలిచితిమి నేఁడ యిద్దఱమును గొం
తెదడవు మానాట్యంబులు, పదరక వీక్షించివాసి పరికింపుఁడొగిన్.

వ. అనియివ్విధంబున నూర్వశి సుపర్వసింహాసనాధ్యక్షు సమక్షమంబున నధిక్షేపంబులువలికి యంతనిలువక యంతంతకుంబ్రబలు నలుక నొకింతయు నళుకక పట్టునలంబునందిట్టుచుం బట్టుకుబుసంబు పక్క—న వీడినవేళ ధారాళస్వేదకణజాలంబునం దరంగితంబగుచుఁ గురంగమదరంగతిలకంబుఁ గరఁగింప హృదయకుహరంబు వెడలి యాడుకోపభుజంగంబు తెఱంగునఁ గీలుజడ యిట్టట్టుచలింప నిలింప వల్లభుంజూడకయుఁ జూడఁగనద్రిత్న రుచిరంభోళికలు వియత్తలంబునం దెరలెత్తఁ దత్తరంబునఁ దలయూఁపుచు సువర్ణకర్ణతాటంక సంకలితారుణమణిప్రభాడంబరంబులు ప్రతిబింబించిన చంద్రంబునం జెందిరంబుఁజిలికినపోలికఁ గపోలఫలకంబులు జేవురింపఁ గెంపుగదురు లోచనంబులం జూరచురంజూచుచుఁ గుచమాచుకంబులపయిఁ

గొట్టువడినహారమౌక్తికదట్టంబులు చుట్టును మిట్టిపడ దీనిఁ గొట్టించకయుంటినేని హరిపట్టినే యని దట్టించి కరంబునురంబుఁ దట్టితట్టి చెఱంగురంగునీలంపుఁ గుచ్చులువిచ్చలవిడింజెదరి పరవంబదరి పదరింఖన్మణిపుంఖిత సింహముఖబిరుదనూపురంబులుబిట్టుమొరయ రయంబడర నడుగులు దాఁటింపుచు విద్యావిశేషంబు జాటింపుచు నెడనెడంజగడంపుజడదారి తనదారింజూపువరపి యొక్కింతప్రక్కలెగయంద్రొక్కనగుచుఁ గ్రిక్కిఱ్ఱుమిఁగుచు మెడనిక్కించి కంచెసారించునెపంబుననెచ్చరింప మిగులమచ్చరింపుచు సంరంభంబున రంభంగదిసియిట్లనియె.

చ. హరిహయుఁడిచ్చినం బిరుదులందుటపాడియె నీకురంభ నా
సరిగనదేశి శుద్ధబహుచారుల నాడఁగలావెయంచు వే
సరిగమెఱుంగుటంచు వగచందురుకావి మెఱుంగురంగుబం
గరుమునుగొంగుపట్టి సురకాంతలచెంతనె పంతమాడుచున్.

క. పట్టినరంభయుఁ జేయట, దట్టివడిందగులుదట్టి తళుకుబెళుకు లి
ట్టట్టుమెఱుఁగుల తెఱంగునఁ, జుట్టుచ్వలగొనఁగఁ దిరిగి సురపతితోడన్.

ఉ. దేవరయాజ్ఞకేవెఱచితిన్ సురనాయక కొంగువట్టి న
న్నావల నొక్కయింతి నిలయంబునకుం జనఁజాలునయ్య లో
చేవడనిప్పుడూర్వశినిజేయని యందఱనవ్వఁజేయనే
కావగమింకె నింక ననుగావుమటంచును బల్కెఁబల్కఁగన్.

చ. అనవిని యూర్వశీరమణి యాననమింత చెమర్ప వాలుఁగన్
గొనలనుగెంపుడాల్నిగుడ గుబ్బమెఱుంగుమిటారి చన్నుల
ల్లన జలిఝంప నూర్పులు దళంబుగ వెండిగఁగ్రమ్మ నయ్యనం
గుని ననువాడిపువ్వు బరిగోలవిధంబున నల్కఁబల్కఁగన్.

గీ. వేయుఁగన్నులుగలిగిన వేల్పుఱేఁడు, తరముగననేర కీర్తితి బిరుదులిచ్చె
రంభవాదాడునిట్టి సంరంభముననె, జుణుఁగుగనియిచ్చె యూర్వశిసుద్దులెల్ల.

క. నాజనకుఁడు హరితత్కృప, నిజగదండమున వెఱయు నిందులనొకచోఁ
డేజరిలునొక్కదొరచేఁ, బూజగొనిన నీదుగర్వమున కెనగలదా.

వ. అనిన రంభ రోషవిజృంభణసూచన లోచనకోణాంకురిత శోణప్రభామేడిత కర్ణతాటంకరత్న ప్రభాడంబరయగుచు నిట్లనియె.

క. హరి మన్ననగలదంచును, గరువంబునఁబలికెదీవు కనుగానకయా
హరిమన్నన నాకుంగల, దరయఁగ నీమహిమలెల్ల నమరులెఱుఁగరా.

క. ఇతఁడింద్రుఁ డతఁడుపేంద్రుం, డితనికి నతనికినివాసి యెఱుఁగఁగ రాదే
పితృభక్తి నెద్దియేనియు, నతిశయముగఁ బలికె దిది యహంకృతియనరే.

సీ. ఆదితాళము ద్వితీయకమంతరక్రీడ జయమంగళమ్మును జంపెలీల
చాచపుటంబు చచ్చత్పుటంబును షట్పితాపుత్రికంబు విద్యాధరంబు
రతిహంసలీల శ్రీరంగంబురంగంబు కంకాళఖండకా కాధములును
కోకిలప్రియము విలోకితంబుకుడుక్క డెంకి త్రిభంగి మట్టిగవిజయము
నందినందన జయసింహనందనములు, మొదలుగాఁగలతాళముల్ మొనసినన్న
గూడికవచట్టముగఁ గొనియాడితేని, బిరుదులివియిత్తునీకు నెగిరుదటంచు

ఉ. పేరణితండలాస్యమును బెక్కణికుండలి నాఁజతుర్విధో
దారములైననాట్యముల యందము నెల్ల నెఱింగియందు నే
పారుచునుండ ముందు విధులాఱునునై తగునంగహారముల్
రారసభావదృష్టులలరన్ నటియించెద మాటలేటికిన్.

వ. అనిన నూర్వశి గర్వసింధుబంధుర తరంగాయిత భ్రూభంగయగుచు నిట్లనియె.

క. నలినాక్షుఁడుపేంద్రుండై, బలినడఁగ స్వర్గమర్త్యపాతాళంబుల్
గొలువఁడె పాదత్రయినా, యలఘుమహిమ యెవరికైనలవడఁగలదే.

సీ. సంయుతా సంయుత సంజీవహస్తముల్ పదమూఁడు నొకయిరువదియు నాల్గు
త్రింశద్గణంబున నృత్తహస్తంబులు నైదువక్షంబులు నైదుఘటలు
స్కంధంబులాఱును గంధరల్తొమ్మిది జానువు లేదు పార్శ్వంబు లేదు
నుత్తమాంగంబు లేకో నవింశతిదశ బాహుల్ త్రికుక్షులుఁ బదములాఱు
స్థాయిదృష్టులెనిమిది సంచారిభావ, దృష్టులిరువది రసదృష్టులెనిమిదియును
బొంకముగఁజూపి వింతకోపులు సెలంగ, నాడఁగలిగినఁ గలహించఁ బాడినీకు.

ఉ. అప్పుడెయేలయిప్పుడును నాఁగకమానగుగొంగు వట్టెదే
యిప్పురుహూతుముందఱనె యిందఱుచూడఁగ నీవుమూచెదే
జెప్పఁగనేల యేమనినఁజెల్లదె విద్యలుగల్గువారికిం
దప్పక యాడుచాలునెక తాళ్త్రియ యొక్కటివింతకోపులన్.

క. ఆడుము నీబిగువులు వో, నాడుము పలుకులకునేమి యదిగాకున్నన్
బాడుము చదువుము మిన్నక, కూడునెయిటువంటిబిరుదు గొనవేమందున్.

క. అనవినిరంభ విజృంభణ, మొనరంగాఁబలికెనలుక నూర్వశియానా
నినువంటి మచ్చెకంటికి, ననువగు నేయిట్టులాడి యాడించుకొనన్.

వ. అని యిట్లు వెండియు నొండొరులమీఱుచు సాటికిం జేటికిఁ జాటిల్లు రోసంబున నెడనెడ హాసంబులడర మణికంకణ ఝణఝణరణితంబులు చెరయ రయంబునం గరంబులు దిప్పుచు దీర్ఘకటాక్షవీక్షణంబులం గప్పుచు నుక్తిప్రత్యుక్తి చమత్కారంబులు మీఱ నహంకారంబున.

క. మానిని యేకాశీతి, స్థానంబుల మెఱసి నిలిచి దశమండలముల్
పూని నటియించు మెచ్చెద, మానసమున నీరసంబు మానక యున్నన్.

క. కరణములు నూటయెనిమిది, వరుసం గొను నీకు మెచ్చి వరమిచ్చెద నా
సరిఁ గొంతవత్తువని స, త్కరణంబులు గలుగునిపుడ తగసభలోనన్.

గీ. కడఁగి షట్త్రింశదుత్ప్లుత కరణములును, హవణుగమకించి యెనుబదియాఱుగగన
భూమిచారులు గలుగు నేర్పులును మెఱసి, శ్రమము మరనిల్చియున్న నా సాటివత్తు

గీ. అబలయాంగిక వాచికాహార్య సాత్త్వి, కములనఁ గమించు నభినయక్రియములమర
సమరవిభు మీఁది దరువులహోరువుల్ల, సరసముగఁ గొను విరసంపు సరణులెల్ల.

ఉ. ఇచ్చట నేల యిద్దఱము నిప్పుడ యేఁగి సభాంతరంబులన్
మెచ్చులు వెత్తమిష్టుకల మేల్ప్రకటించుచు నింటఁ గెల్చి యా
రచ్చను గెల్వఁగావలయు గట్టిడివాదిటువంటి సుద్దు లే
నిచ్చినఁగాని యింకఁ జలియించునె రంభయు దంభయుక్తులన్.

సీ. జడధిభంగముతోడి జనియించినట్టి నీకే భంగమునకు నింకేల తలఁక
జడనిధిశాయికి జనియించినప్పుడే భంగంబు నీకుఁ జొప్పడక యున్నె
దళమెత్తి యాడిన తలవంచెదవు నీవు రంభ యిందులకు సంరంభమేల
దళమైన విద్యయందము చూపకుండినఁ దలవంపు నీకెపో తలియఁ బోఁడి
యర్ధపతిపట్టిఁ జేపట్టినట్టికతన, నిట్టిగర్వంబు పుట్టెనో యిదిసహజమొ
యర్ధవంతునివిద్యయే యతిశయించు, నర్ధమూలంబు జగమెల్ల ననగవినవె.

సీ. దారుసంజీవని చారుసంగీత విద్యకునుండ నీగాన మలరఁగలదె
కనకాంగి క్రియ మెచ్చె కోనియుండ నామ్రోల నీయభినయమింక నిలువఁగలదె
పుంజికస్థలశబ్దముల పుంజిగనుపించుటకె పూవనీపల్క ప్రకటమగునె
క్రతుశుల్కదేశినిల్కడలకేననిపల్క నీయాటపరిపాటి నెగడఁగలదె
వెండియొక్కొక్కవిద్యకే వేలువేలు, రచ్చకెక్కినయచ్చరల్ హచ్చరించి
యుచ్చరించినమాత్రనే యొచ్చెమెంచ, హెచ్చియుండంగ నీగర్వమెంతగలదు.

క. అచ్చరలు నేఁడు క్రొత్తగ, వచ్చిరొ నావిద్యఁ గలుగువగ లెల్లను వా
రిచ్చల నిచ్చలు మెచ్చరొ, మచ్చరమింతేల తేలమాటాడరే.

క. అనియిట్లు రంభ యూర్వశి, యును గలహించంగ నింద్రుఁ డోహో నిలురం
భ నిలువు మూర్వశియని వా, రినివారించుచును డగ్గరికిఁ బిల్చితగన్.

క. చెలులార మీదువిద్యా, విలసనముల మహిమ నేఁడు వింతగఁ జూడన్
వలెనె కిరీటము వెట్టిన, తలకున్నల్లడుగఁ బోవఁ దగు నేయెందున్.

ఉ. మానినులార మీనటన మార్గములందుఁ బరస్పరాధిక
న్యూనత లెంచ లేఁడు హరియుం దమసాతటినిప్పుడుగ్రతం
బూనితపంబు సల్పెడు తపోధనశేఖరుఁ డొక్కరుండు మీ
మీ నిపుణత్వముందెలియు మేకొని యమ్మౌని లోను జేసినన్.

సీ. లోచూపు మరలించి లోచనంబులు విచ్చి సొగ మీమొగములే చూచుచుండ
మంత్రిస్మరణమాని మానంబు దిగఁద్రోచి యలరి మీతోడ సపలుకుచుండఁ
బద్మాసనము విడి భావస్థిరతఁ బాసి మరఁగి మీవెంటనె తిరుగుచుండ
ననశనస్థితి విడిచి యనిలపూరణ రోసి మీరిచ్చు ఫలములే మెసవుచుండ
నలమహాముని బామది యలరుటంప, సోనలను ముంచి తత్తపస్ఫురిత తాప
మెల్లఁ బో మెల్ల నే యలయించి మీరు, చన్నుఁగొండల పైనుండఁ బన్న వలయు.

క. ఇద్దఱలోపల నెవ్వతె, దద్దరిలక యతని ధైర్యధనముఁ గొనెడు నా
ముద్దియ కేయీబిరుదుల, పద్దులు దగు నిజనిజంబు భామినులారా!

చ. అనిసురనాథుఁ డా చెలులకప్పుడు కల్పక సంభవంబులౌ
ఘనమణిభూషణంబులును గాంచనచంద్రికితాంచలంబులై
కననగు చంద్రికావి నును గావులుఁ గొమ్మని యిచ్చి వేగ బో
మ్మని నకరాబ్జముల్మొగిచి యచ్చరనెచ్చెలులిచ్చ మెచ్చఁగన్.

సీ. చెఱకువిల్లసదని వెఱకుమా యీకొమ్మ బొమవింటనలిమార్వ హోతుగాని
కాలంబు గాదనిక ళవళపడకుమీ కలికిపాటలఁ జూచి నిలుతుగాని
యొదఁ గందునను గుంది యెదవడకుండుమీ సఖిమోము చాయ నేచనుదుఁగాని
గంధపుఁగొండపైఁ బొందు లేదనకుమీ చెలియూర్పు నెత్తావిఁ బొలుతుగాని
మదనమాధవశశధర మలయపవన, యనుచుగతి చూపి శుకపిక హంసభృంగ
కీములకు సతిపలుకులు గీతి నడయు, చూపుఁగుఱులును బలభేది మాపిపనుప.

గీ. ఇంత మాత్రంబు మీరానతిచ్చినపుడె, యెంతయుగుఱిందో యామాని యేమియైన
నేమి నీకృపగల్గినస్వామి యెట్టి, కార్యమైనను సాధింపగలముసుమ్ము.

క. సుందమరు దిందుమాధవ, కంచర్పాదులనునోపుగా నిపుకొని సం
క్రిందన కదలెద మేమిదె, మందాకినిదాఁటి నేఁడె మహిమండలికిన్.

క. అనియనిపించికొని సురాఁ, గనలమ్మని నెమ్మనంబు గరగించుటకున్.
గనుసన్నలనె యుపాయము, లనువుగనూహింపుమని బ్రియాణోన్ముఖులై.

సీ. పుంజికస్థలయలంబుస మనోరమ హేమదారు సంజీవనిచారునేత్రి
కనకాంగి ధాన్యమాలినివపుష్మతి శుచిస్మిత సులోచననీల మిత్రకేళి
దేవివిద్యుద్వర్ణదివ్యతిలోత్తమ చిత్రసేనఘృతాచి చిత్రరేఖ
జలజాస్య మేనక శశిరేఖగోపాలి ప్రమ్లోచవిశ్వాచి పంచమాళి
లలితక్రతుశులర్కర్పూరతిలక హరిణి' మొదలుగాఁగల యచ్చరముదితలెల్ల
నొనరఁదముగొల్వ రంభయునూర్వశియును, నందనవనంబునకు నేఁగి యందునిల్చి.

క. మందారకల్పతరు హరి, చందన సంతానపారిజాతంబులచేఁ
బొందుగభూలోకంబున, కుందగిన సువస్తుతతులుఁ గొనుచున్ వేడ్కన్.

క. నందనము వెడలిపయనపు, టందముగజవాదిపూఁత లలఁదితొడవులం
గుందనపుటంచువగజిలు, గుందెలిసాలియలు జారుఁగొప్పులునొప్పన్.

చ. నడచిరి యంతరంభ భవనంబున నుండెడుసోమయాజులె
క్కుడుతమిఁ జాయలేమివడిఁ గూడఁగరండిటు వాజపేయులె
క్కుడిపయనంబువచ్చి మనకర్మము లీగతినుండెనేటికిన్
జడిసెను పౌండరీకులని సారెకుఁబలుకుచు నెండకలుకుచున్.

క. పెంజెమటజార దోవతి, పింజెలుమాటికిని గాళ్ళఁ బెనఁగొనఁగడుపుల్.
గుంజెలువెట్టఁగ వేలుపు, లంజలఁగూడంగఁజని హళాహళిమెఱయన్.

సీ. రత్నకంబళమతి గాతుఱిలుగొంచురా సర్వతోముఖులు వేసరగ నేల
తాళవృతంబు మాపాలిదిచయనులు జగడంబులాడక చనుఁడుకడకుఁ
గపురంపుఁజెట్టె మీకట్టడయెటుఁగరా సత్రయాజులకంత చలముగలదె
ముత్యాలచౌకట్ల మూటమాపోపాట తెలియదేవాజపేయులకు నెపుడు
నాఁడెకరతువులు రామార్పణముగఁజేయ, కుసికిమేపాటువాట్లె మనలకనుచు
సోదిజను దెంచుయజ్వలజూచినవ్వి యవ్విబుధకామినులు వారిననిపి యచట.

క. తగువారివెంటరమ్మని గగనంబుననడచిరిందుర్ఘనసౌధంబున్
మగుడిమగుడిచూచుచున మ్మృగువలుమఱివారినంటిమార్గమునందున్.

ఉ. పట్టుగుడారముల్ చికిలి బంగరువ్రాతల చిక్కిబీగపుం
బెట్టెలుఁ బచ్చఱాపలకపీటలు మేలివకాసుకుట్టుమేల్
కట్టులు గ్రొత్తనెత్తపలకల్ తెరలుంబిక దాఁబారువా
బిట్టలగూండ్లుఁ గ్రొమ్మెఱుఁగు బింబెలుఁ గొందఱు తెచ్చిరయ్యెడన్.

సీ. దంటనీలంపు చిక్కంటలు దంతంపు దువ్వెనలుక్కుంకుమ పువ్వుఁబఱపు
సకినలమంచముల్ చౌకంపుఁబొంబట్టు బటువులు రాచిల్క పంజరములు
పరిమళంబులయుబ్బ బరిణలు చంద్రికాంతపుఁగోరలు విరికుందనపుగిండ్లు
నిలువుటద్దములు వీణియలు దండియలును దాళముల్వేణువాద్యము లురుమలు
సారజంబులు ముఖవీణలానకములు, మద్దెల లుపాంగములు స్వరమండలములు
మొదలుగాఁగల సాధనంబులుధరించి, కొందఱరిగిరి వెనువెంటఁగూడియపుడు

సీ. భృంగంబచెలిమాపు బెళుకులోనిలువుమీ మొక్కలంబుననొంటి మొక్కపోక
చిలుకచిలుకలకొల్కి పలుకులోమెలఁగుమీ నీరంబునను జెలిబీరువోక
యంచయంచితయాన యడుగులోనడువుమీ బింకంబునను మదంబికిపోక
కోయిలకలకంఠి కుత్తుకైయుండుమీ మోడితోఁజనిమొగమోడిపోక
ననుచు బలములమున్నగా ననిచితనకు, వెన్నుఁబలమయి మాధవ విధుసమీరు
లంటినడవంగఁ గదలెఁ బూవింటిజోదు, దండనుద్దండ పుండ్రకోదండుఁడగుచు.

ఉ. ఇక్కరణింబురందర పురేందుముఖుల్ చనికాంచిరంతయుం
జక్కనిచాయనల్లసిత సారసహంస రథాంగభృంగ స
మ్యక్కలనాద మేదుర నిరంతరతుంగతరంగఘోషముల్
దిక్కులనిండఁ బాండురుచిఁ దేరు సురాపగ వేడుకల్దగన్.

గీ. కాంచిరంభోర్వశులు మదిఁ గౌతుకమున, విష్ణుపదియన నీనదివెలయుఁజూవె
యిందుకుల్యల సాఫల్యమొందుమనఘ, నందనంబును దీనికి వందనంబు.

వ. అనినమస్కరించి వెండియు నయ్యండజయాన లొండొరులంగనుంగొని.

ఉ. కన్నెమిటారి బేడిసలు కన్నులచెన్ను వహింపఁజక్కవల్
చన్నులచందమొప్పజలజాతపరాగము హత్తిప్రత్తిపూ
వన్నియలీలనొప్పఁగను లారవిలాసిని వోలెనందమై
యున్నది యున్నదీమణి తిలోత్తమ చూచితె యెంతయొప్పెడున్.

క. అభ్రకరిజాలములోపల, నభ్రముపుందాను గ్రీడలాడెడుఁగంటే
విభ్రమమున నిచటే మ, త్తభ్రమరములల్లగండ తలములనిండన్.

చ. పగడపుఁజాయముక్కులును బాదయుగంబులుఁ బైఁడిరెక్కలున్
జిగినునుసోగ వెన్నెలలఁ జిమ్మెడు మేనులు మించనంచలీ
గగనతరంగిణీవికచ కాంచనకంజ వనీగృహంబులన్
సొగసి రమింపుచున్నయవి చూచితె చారుచకోరలోచనా.

క. అనితన్మహిమముఁ బొగడుచుఁ, జనిచనితమసాతటంబు ఛాయనెగగనం
బుననుండి దిగిరినిర్ఝర, వనితలవనితలమునవయవద్యుతిగ్రమ్మన్.

సీ. జలదకదంబముల్ చంద్రబింబంబులు శరభముల్ విద్రుమసముదయములు
శంఖసంఘములు గాంచనలతావలయముల్ చక్రవాకంబులు జలరుహములు
మెఱుఁగుఁదీగియలుఁ గ్రొమ్మించుమానికములు నావర్తములు సైకతావళులును
కరికరంబులు బాలకమఠముల్ మౌక్తిక పాళికల్ నవ్యప్రవాళములును
గగన జలనిధిలోనుండి కలసియొక్క, పరియతోరగెనో యనఁగఁ జూపరకుఁదోఁచెం
గాంతతరలీల గీర్వాణకాంతలెల్ల, తీవి మెఱయంగ నవనికిడిగ్గినపుడు.

సీ. వియదంబునిధినుండి వెడలివచ్చిననేక లావణ్యమయమాయ లక్ష్ములనఁగ
బ్రహ్మాండఖనిఁబుట్టి పఱతెంచుజీవ కళాకలిత మణిశలాకలనఁగ
జలదబృందంబులోపలనుండి దిగువకేతెంచు కారుమెఱుఁగుఁదీఁగెలనఁగ
మిన్నేటినుండి భూమికివ్రాలు గన్నెప్రాయపు మేలిపసిఁడి రాయంచలనఁగఁ
జూడఁదగియామరుల్లోక సుదతులవని, కవతరింపుచుఁ దమసాతటాంచలమున
నిలిచితమతమసారస్యములు సెలంగ, మెలఁగుచుండఁగఁ బరిచారకులుగఁ దంగి.

క. అమ్మౌనితపమొనర్చువ నమ్మునకుంగ్టౌదురఁగనందగుబయలన్
గ్రమ్ముకొని పొదలువకుళకు లమ్మల ఘుమ్మను సమస్థలంబున నొకచోన్.

చ. సమముగ మిట్టపల్లములు చక్కఁగఁజేయుచుఁ జుట్టినీరువా
టముఁగని నాల్గువంకల గుడారములెత్తిరి చీనిపట్టు ప
గ్గములు బిగించి గూటములుఁగట్టినరాతులఁగూర్చి ముందటం
గొమరగు పైఁడితీవ పసిఁకుట్టుల చప్పరముల్ చెలంగఁగన్.

ఉ. అక్కడి చాయరంభయును నాత్మసఖీమణులెల్లఁ గొల్వఁగా
నెక్కసలాడు రాచిలుక పెక్కపుమేలి గుడారునందు సాం

పెక్కువసించె నూర్వశియు నిష్టవయస్యలఁ గూడి గండుమీన్
టెక్కెపుయంపుఁ గుడారమున నిల్చెఁ బథశ్రమముల్ దొలంగఁగన్.

ఉ. అంతట నంశుమంతుఁ డపరాంబుధిఁ జేరె శకుంతసంతతుల్
బంతులుగట్టి గూళ్ళకెగఁ బాఱఁగ సాగె దిగంతసీమలన్
సంతమసంబు పేరె జలజంబులు దారె రథాంగపంక్తికిన్
గంతులు దీఱె నుత్పలవనంబుల నాడఁగఁ జేరె భృంగముల్.

సీ. గగనాంబునిధిలోనఁ గనిపించుమౌక్తిక నికరంబులనఁగఁ దారకలు నిక్కెఁ
దారకాంగనలెల్లఁ దమి నాడుకుందకందుకము చందమునఁ జందురుండు దోఁచె
చందురుఁగన్గొని పాలసంద్రంబు పైకుబ్బి నిండెనా పండువెన్నెలలు గాసె
వెన్నెలపైఁట గర్వించి పంచశరుండు కలువతూపులను లక్ష్యంబు సేసె
గలువతూపులమర్మము గాఁడ బెదరి, పదరి మెత్తనితలిరాకుఁ బాన్పులందు
బల్లవులఁ గౌఁగిలించిరి పల్లవోష్ఠు, లలఁతి తెమ్మెరనెమ్మెని యలఁతదీర్ప.

చ. నిలిచినతేటవెన్నెలలనీడలు చూచుచుఁ గట్టివెన్నెలల్
జిలుకుమెఱుంగు ముక్కుతుదఁ జించి మెసంగుచు దప్పిగప్పినం
బలుచనితియ్యవెన్నెలల పానము సేయుచుఁ బ్రేమ డాయుచున్
మెలకువమించనయ్యెడ రమించఁ దొడంగెఁ జకోరదంపతుల్.

క. ఇమ్మాడ్కి జనానందక, రమ్మగవెన్నెలలు గాయ రంభోర్వశులున్
గుమ్మెతగుడారములకడ, ఘుమ్మను కపురంపుజగతిఁ గూర్చుండితగన్.

గీ. దండియలు మీటి రహిగాన దంతిచెలగ, నింద్రమీదటిపదము లెన్నెనివింత
వర్ణములఁబాడి యుత్పలవాసితంబు, లైనగంధోదకములు గ్రోలి హళిదేలి.

ఉ. చొక్కుచునచ్చటన్ మదము సొంపునసోలుచునుండి యంతటం
జక్కనిపైడితీవపని చప్పరమంచములన్ వసించి రిం
పెక్కఁగ నూడిగంపు జెలులివ్వల నవ్వలఁ గంకణధ్వనుల్
పిక్కటిలంగఁ దాళగతి లీలబుహత్తి పదంబులొత్తఁగన్.

సీ. ఇటులవ్వధూటులు పటగృహంబులలోన బవళించి మానితపంబుఁ జెఱుప
నెద్దియుపాయంబొ యద్దివ్యసభయందు మనలకు గీర్తిగల్గునొకో యింక
ననిపలుకు చొక్కింత కనుమూసిరో మూయరో యంతటనె తూర్పునను వేగుఁ
జుక్కగన్పించె నల్దిక్కులు దెలుపెక్కె నరుణోదయంబయ్యె నిరులువిరిసె

కుక్కుటంబులు గొక్కొరో కో యటంచు మ్రోసెఁ బక్షుల కలకలంబులు చెలంగె
వనజములు నెల్ల ముకుళభావములు వదలెఁ గదలెఁ దమజోడు గూడి జక్కవలు వేడ్క

క. ఉదయించె సూర్యుఁ డంతట, నుదయాహార్యంబు నెల్ల నుస్రసహస్రా
భ్యుదితారుణరుచి మేలిమి, యుదిరి పసిఁడికొండ పగిది నుండం జేయన్.

వ. ఆసమయంబున.

క. ఉప్పవడంబై వేలుపుఁ, గప్పురగంధులును వేడ్కఁ గైసేయుచు నేఁ
డప్పరమహానియుండెడు, చొప్పరయుద మనుచు నడుచుచును దమలోనన్.

క. గ్రక్కునఁ జనరాద చటికిఁ, జక్కఁగఁ గుసుమాపచయ మిషంబున సొంపుల్.
నిక్కంగఁ బోయి యతనిం, జొక్కింతము మానులింత సులభులె తలఁపన్.

క. అని పలుకుచుండు నంతకు, మునుపె వసంతుండు పికసమూహము పొగడన్
మనసిజుఁడు నెగడ మలయప, వనసహితుండగుచు నచటి వనముల నిల్చెన్.

సీ. మోదుగుల్బిగిరించె గేదఁగుల్ నలొత్తెఁ గురువిందములుఁ గలిగొల్లుఁ బూచె
మల్లియల్ గొనసాగె మొల్లమొగ్గలు వైచె మావులు గ్రోవులు దావి నెసఁగె
బొగడపుష్పాడిరాల్చెఁ బొన్నతేటలఁ బొల్చె నిమ్మయు గోఁగుఁ దేనియలు గురిసె
సంపెఁగ ల్వికసించె జాద్దుల్మ్రదాళించె గోరంట తిలకంబు గుత్తులొత్తె
వావిలియుఁ జేఁగ్రింకణంబును వంజులంబుఁ గడిమి చెట్టులు నలరె నప్పుడు వసంత
సన్నిధి విశేషమున వనస్థలమునందు భువియు దివియును ఘుమ్మని పొదలుచుండ

వ. ఇవ్విధంబున వసంతంబు శుకపిక శిలీముఖ ముఖరితాఖిల దిగంతంబగుచు విజృం
భించుచునుండ.

ఉ. చందురుకావిపావడల జాజు పిఱుందులఁ జిందుద్రొక్కఁగా
గందుపిసాళి సాళియలుగట్టి కదంబపుఁ బూఁత తావికిం
జెందిన తేఁటిదాఁటులనఁ జెన్నగు కీలుజడల్ నటింపనా
సుందరు లందఱున్ వనము సొచ్చి చలన్మణినూపురంబుగన్

ఉ. కేరుచు నవ్వధూమణులు కేళివనిన్ విహరించి కొందఱం
జేరుచుఁ గన్నెగేదఁ గులఁ జీరుచుఁ బూబొదరిండ్లు వేడుకన్
దూరుచు రాని నెచ్చెలుల దూఱుచుఁ గమ్మని పువ్వుతోళ్లలోఁ
గూరుచు సారసౌరభముఁ గూరుచు చల్లని గాడ్పుఁ గోరుచున్.

రగడ. నిచ్చ నిచ్చగ నలరువండలు నిండ నిండ యనుంగుఁ జెలులకు
విచ్చ విచ్చన విడివిరుల్ గురు వింద విందొనరించె నలులకుఁ ;

గలికి కలి కిలతలను దుమ్మెద గంతు గంతులు చూడుమాటికిఁ
జిలుక చిలుకల కొల్కిపలుకులఁ జిక్కుఁ జిక్కులఁ బెట్టనేటికిఁ
గంతు కంతుకము లనఁదగునిది గాదె గాదకు మిగుల గుత్తువె
యింతి యింతియ కాదునీమది నించ నించఁగఁ జూచె దెత్తువె
చెలియ చెలియల నీకు నేనన జిర జిరఁగదిలి చెంత వత్తువె
చిలువ చిలుప మరందరసముల జెట్టచెట్టల విద్య మెత్తురె.
కన్నె కన్నెర చేయునేటికి గానగానవమల్లి మొగడలు
నన్నె నన్నెన నీకుదగునటె నవ్వ నవ్వల లేవెపొగడలు
మోదు మోదుగ పువ్వు రెచ్చెను మున్న మున్నర కైకముచ్చిరి
లేదు లేదుండగ ముదినికి లేమ లేమయు పాట వచ్చిరి
దాడి దాడిమములకుఁ బెట్టెను తరుణి తరుణిమ గర్వమెంతన
నీడ నీడలు నిండెఁబేర్మిము నిక్కి నిక్కడ నిల్తుమింతన
కంటె కంటె యొనర్చునిది శుభ కాంతి కాంతికి లతిక జాతికి
నంటునంటునఁ బొప్పాదులనది నాన నానఁగఁ జేసె నాతికి
పాళిపాళి కుచంబులంటిన నాతినాతి తనానదిట్టైకు
బాలిబాలిక పువ్వు లేదని పల్కఁబల్కరు గోవుకట్టెదు
కలికి కలికుచ యీసునెమ్మదిఁ గ్రిమ్మఁగ్రిమ్మఱ వాడువెట్టకు
దళముదళముగ రాతినరిపోద దండదండము నీకుమెట్టకు
యిప్పయిప్పటి కింపునింపెడు నిందునిందుని భాస్యని ల్తామె
యప్పయప్పరువంపు మొగ్గల యాసయాసతి వల్లఁబెల్తామె
చామచామన మేని యాచెలి జడనుజడను వడంగవేసెను
రామరామ కరందఘునసుమ రాజిరాజిల నదియకోసెను
మాదిమాది ఫలంబుతగదిటు మలయమలయజగంధి ముందఱ
ననలననలస గతులఁగోసిచనంగనంగన యిపుడు వచ్చెను
మనముమనమున నెపుడునీచెలి మాటమాటగ నిటులు హెచ్చెను
చాలుచాలునగంటి మీరల సరససరసము లాడఁగూడదు
మేలుమేలుపడెన్ లతాంతము మీఁదమీఁదటి యెత్తుమాడదు
లానలలనద పుష్పగుచ్ఛల లామలామ జ్జికముగంటిరె
యలికియలికి లతాంగికొర్విర్విరి నంటనంట పొసంగవింటిరె

వామవామగతిఁ జానకేయురు వంకవంకటు చూడువింతలు
యేమయేమనవచ్చు నెచ్చెలి కీరకీరము నియ్యెముచ్చట
రాలరాలగ దుల్వేలివిరిసిగ రాఁగరాఁగత మేనియింతలు
యరసియరసి కతాతటస్థలి యందయందఱు వలయుఁజేరఁగ
సరసిసరసిజములును గొనుఁడు వసంతసంతత కేళిమీఱఁగ.

క. అనివనిలో విహరింపుచుఁ, జనిచని చంద్రముఖు లిష్టసఖులిరుగడలం
గనిమనికొలువఁగ నట య, మ్మునియునికికి నేఁగి యతనిముందఱ వేటన్.

ఉ. తేనియకొన్న నల్పసిమి తిన్యనితియ్యని పంకజాలఁ గా
గానుకగాఁగనుంచి పదకంజములం బ్రణమిల్లి లేచియో
మానివరేణ్య ? పుణ్యమహిమన్ మిముఁగన్గొనఁగన్గె సత్కృపా
నూనకటాక్షవీక్షణము నూనఁగఁజేయుము మమ్మునిత్తఱిన్.

క. అనిపలికె యతఁడొకింతయుఁ, గనుదెఱవక వలుకకున్నఁ గనియందఱు నె
మ్మనమున నచ్చెరువందుచు, మునుపెన్నఁడు గానమిట్టి మునిజగములలోన్.

క. గట్టిగనుమూఁగదయ్యము, పట్టినదోకాక చెట్టొ బలురాచట్టో
యిట్టులు మనమిందఱమును, జుట్టుంబిలువఁగ నొకింత చూడకయున్నే.

సీ. హరినీలములతోడ సరినీటుపచరించు కప్పుఁదేరెడు నునుగొప్పుచొప్పు
మీటేరుపడిమంచి కోటేరువెట్టిన మురువుచూపట్టెడు ముక్కుటెక్కు
పాలుగారుచుఁజంద్రు మేలుగానఁగనొప్పు సోహనంబగు నగుమోముగోము
వాటమౌరత్న కవాటమౌనిదియనఁజాల శోభిలెడి వక్షంబుడంబు
తళుకుబంగరుముప్పిలి తరఁటువోలె, నున్నయది మేను చూడంగ మున్నితండు
విటుఁడయిచరించి కొన్నాళ్లి వెనుకఁదపసి, యయ్యెఁగాకిట్టి యందమెందైనఁగలదె

క. కనమేబిరానవల్వా, రినపచ్చనియొడలు జేగురించిన జడలుం
బెనువంకమెడలుగలయ, మ్మునిజడలున్ సొంపులెడల ముల్లోకములన్

క. యువతులసంగతులం గల, చవులెఱుఁగఁడు పుట్టుమొదలు సత్యముగాదే
నవలాలచూపుదలలన్, దవులనివాఁడుం గలాఁడె ధైర్యముతోడన్.

వ. అని యందఱు నన్నివిధంబులం బలుకుచుండ రంభ యిట్లనియె.

క. మద్దెలసద్దున నీతని, నిద్దురమబ్బెల్లఁబోవ నేర్పుమెఱయ నే
సిద్ధముగ దేశిఁ గొనియెద, నొద్దిక గానుండుఁడనుచు నొనరిచి సఖులన్

క. బంగరుకాసెయు ముత్తెపు, రంగుల్లచనుకట్టుఁబూని రంభ మిగులమై
సింగారము వెలయఁగ ముని, పుంగవు నెదుటన్ మెఱుంగుపోలిక నిలిచెన్.
క. నిలిచి యటునడిచి పుష్పాం, జలిచేసి యసంయుతములు సంయుతహస్తం
బులుచూపి పసిఁడి గజ్జెలఁ, జెలఁగెడు చరణములు రవళిసేయుచు వేడ్కన్.
సీ. తరుణీమణియొకర్తు తంబురామొరయించ వెలఁదియొకర్తె ముఖవీణె యూఁద
సరసిజాక్షియొకర్తు స్వరమండలము వాఁచ బోఁటియొకర్తె దండ మీటిపాడ
విమలాంగియొకర్తు వీణియపలికించఁ గలికియొకర్తె యుపాంగంబు పూనఁ
గిసలయాధరయోర్తు కిన్నరమీటంగ లోలలోచనయోర్తు తాళమొత్త
మఱియుఁ గొందఱు సుదతులు మద్దెలయును, నాదజము మొదలైనవాద్యములువట్టి
శ్రుతులుఘుమ్మని పావణించె నతివదేశి, నృత్తవైఖరిచూపె మునీంద్రునెదుట.
గీ. ఇటులమిగుల నేర్పు ఘటియిల్లఁ జూపిన, నృత్యగీతవాద్య నిపుణమార్గ
పటిమ చెవిటిమ్రోలఁ బాడినసంతనా, ఫలము లేకపోవ బదరిరంభ.
సీ. ఒకకోపుచాలదే శుకవామదేవులకైనను దపము వాయంగఁ జేయ
నొకచూపుచాలదే సకలదేవతలను మోహమహాంబుధి మునుఁగఁ జేయ
నొకపాటచాల్లదే యుర్విలోశైల సంఘములు నీరుగఁ గరుఁగంగఁ జేయ
నొకమాటచాలదే యుల్లోలకల్లోలముగఁ దేనెవంకలు నిగుడఁ జేయ
బూనియిటువంటిబిరుదు కోపులును బెళుకుఁ, జూపులును వింతపాటలు సొగసుమాట
లు రహినెన్నిచూపిన మదిగరఁగదయ్యొ, దయ్యమేమని పుట్టించె నయ్యవీని.
వ. అని మఱియు ననేక ప్రకారంబులఁ బలుకుచుఁ దమనటన చాతుర్యంబున నతిధైర్యంబునుఁ దన విలాస భావంబున నతిజడభావంబును దేజస్తిమిర సంపర్కంబు నుంబోలె నొక్కింతి యలంబొందు వడకయున్న డెందంబునం గలంగుచు.
గీ. చిన్నబోయి రంభ చెక్కటఁ జేయిడి యున్నఁ జూచియంత నూర్వశియును
నేనొకింత దడవుగానంబుచే మౌని మనసు గరతు ననుచు సనుచు వేడ్క.
చ. సరిగ మెఱుంగుఁ జంటపుబుసంబునఁ జన్గవపిక్కటిల్ల మే
ల్తరమగు కావిపింజియపదంబులఁ జిందులు ద్రొక్కఁ బచ్చక
ప్పురమున హెచ్చుకుంకుమపుఁ బూఁత సుగంధము చోడుముట్టఁ గ్రొ
వ్విరిసరులన్ సిరుల్లోలఁకు వేణిచలింపఁగ వచ్చియచ్చటన్.
క. మునికట్టెదురనొయ్యారము దనరఁగఁ గూర్చుండి యొక్కతరుణీమణిఁ గ
న్గొనివీణియఁ జెమ్మని చక్కని పలుకులఁ దేనెలొలుకఁగాఁ బలుకుటయున్.

సీ. తళుకు నీలపు దట్టములువోలె నీడలు గానంగఁ దగు గుబ్బకాయలమర
రతనాల పూసల రాజిల్లెడు సిరాజి పగడంపు మెట్టులుజిగి దొలంకఁ
బ్రచుర రాగ లతాంకురములు వ్రాసినలీల మెఱుఁగారు తంత్రులు మీటుచూప
ఘుమఘుమ ధ్వని నించు క్రొవ్విన యపరంజి కళుకుల యనుసుల యొళుకుదనర
జీవ రత్నంపు మేరువు చికిలి కెంపు బిరడలును గరుడ పచ్చల కరివెజీని
వ్రాత పెంబట్టు గవిసెనరాణ సనరు వీణె యొకయింతి నిల్పెను వెలఁది యెదుట.
వ. ఇట్లు తెచ్చినవిపంచికి నమస్కరించి పాణి యుగంబునఁ గైకొని.
సీ. గవిసెన సడలించి కరపంకజద్యుతి గడలు గ్రోఁజీని పావడలు దుడిచి
బలితంపు మెఱుఁగు గుబ్బలమీఁద ఁదీర్చియు మృదున నఖంబుల శ్రుతులంటిమీటి
జవ్వాదిఁ బదనిచ్చి సారణుల్సారించి సరసతబిరడలు చక్కనొత్తి
మంద్రమధ్యమ తార మహిమమీఱంగఁ ద్రిస్థానంబులును ముట్టితాళగతుల
నతులకంఠ ఝుణఝుణత్కృతులుసెలఁగ మాయరేయన రాగములాక్రియములును
గీతములు ప్రబంధములు రక్తిఁగనుపించ వీణెమీటెను నానీలవేణి యపుడు.
మ. లలనారత్నముగాన మాధురికి శైలంబుల్గరంగెన్ మృగం
బులు మేపుల్విడి చూచుచుండెనచల న్మూర్ధాగ్రకర్ణంబులై
చెలఁగెన్ బక్షిగణంబు మోడ్పులు నిగిర్చెన్ మాని డెందంబుని
శ్చలభావంబున నంతకంతకుఁగడున్ సంధించెఁ గాఠిన్యమున్.
క. అదిగని యూర్వశినవ్వుచు, నదిగామదిఱాయివంటి దనియెడు పలుకుం
జెదరెను పామనమొక్కటి, వెదుకవలయు వీనిమదికి విశ్వాసములోనన్.
శా. ఔరారాగము బాపురే యొకు రాయంబుల్ బళీస్థాయి సం
చారీప్రపులు లెస్సకంపితముమైచాగోపెలు మేలమ్మ్రియ
యొయ్యారే మీటుకోలంబు పాడఁదగునాహార క్రియంచున్ సభా
సాగుల్లేరిటమెచ్చ నీజడుఁడు మెచ్చెన్ నేర్చు నేగానమున్.
క. అనిపాక్కపలికి రంభం, గనుఁగొని మనతగవుఁదీర్చెఁగా మునితపమే
ఘనులతపంబులు చెఱుపం, బనిచిననిక ఁజనఁగవలదు పదివేలైనన్.
క. అప్పయుఁజెల్లెలు బళ్లెమన, మెప్పడు నీకఁగూడియుందమిద్దఱమును సాం
పొప్పననివారు పాళియ, మప్పుడెయెత్తివడిన్నరిగి రమరావతికిన్.
వ. ఇవ్విధంబున రంభోర్వసులు తమ యఖర్వగర్వాంధకారంబు మునిలోకబాంధవు
తేజఃపరిభావంబున దూరంబగుటయు నిర్విణ్ణహృదయలై సుపర్వరాజధానికింజనిన

యనంతరంబ యనంతశాంతగుణమణిఘనీభూత తపోధనుండగు నాఘనుండచ్చటికి నాయచ్చరమచ్చికంటులు వచ్చుట పోవుట లెఱుంగక యభంగధ్యాననిష్ఠాగరిష్ఠుండై చెలంగుచుండ.

సీ. సంచారమాచెంత నించుకంతయు లేమిఁ జెదలుఁ బుర్వులు నేలమెదలఁదొడఁగె
జెదలుఁబుర్వులతనిఁ బొదుగఁబుట్టలువెట్టె బుట్టకొ్రవులలోనఁ బుట్టెఁజెట్లు
చెట్లయందే ప్రవేశించి నాలుకలుగ్రోయు పెనుబాములను దీఁగెలును బెనంగె
దీఁగెలంతంతట దిరిగిగూడులుగట్టె గూడులలోనఁ బక్షులుసెలంగె
నంతరాంతరములయందు దంతిసింహ, శరభశార్దూలసింహంబు లిరవుకొనియె
బార్ధివకళేబరంబు లోపలవెలుంగు, నంతరాత్మయుంబలె నతఁడందునుండె.

క. అటసప్తర్షులు హిమవ, త్కటకవినోదములుచూచి క్రమ్మరి తమసా
తటమునకువచ్చి యచ్చట, నటునిటుఁగనుఁగొనుచు వారలందఱుఁదమలోన్.

ఉ. శుష్కవనంబు మున్నిచటఁ జూడఁగ నేఁడిదె వింతవింతలై
పుష్కరిణీరసోర్మికణపూరిత శీతలవాతపోతకా . .
విష్కృతపుష్పనిష్పతదవేల రసాల మరందకందళీ
పుష్కరనిర్ఝరాళిక్రమగులఁ బొల్పువహించె మనోహరంబులై.

సీ. ముందుకోరెంద లేకందు మొందునునెందు నల్లోనేరెడు లెన్నియల్లుకొనియె
మున్నుసన్నపుటీఁత ముద్దుఁలీచెంగట సురపొన్నగుంపము ల్జొంపమయ్యెఁ
దొల్లియంతటదంతె దొంతరలీచెంతఁ దియమామిడులెన్ని మూయువరిగె
మునుముమ్మరపుఁదుమ్మె నునుగుంపులీవంక బలువేరుపనసలు బలిసెఁజాల
నాఱుబుతువులఁబుష్పంబు లలరుచున్న, వెంతవింతలు మనము నేఁడేడులయ్యె
హిమగిరికిఁబోయి యింతలో నెన్నిపుట్టె, దేశకాలవిశేషము దెలియవశమె.

సీ. పులు మేపులునుమాని పులులవీపులుమెట్టి గునిసియాడెడు లేటి కొదమలిచట
దమినీలకంఠకంఠముల హారంబుల బాగుజూపెడుఁ గోడెనాగులీడ
సింగంపుఁగూనలఁ జేపట్టియాడుచు నున్నవి యేనుంగు గున్నలిందు
ముంగిసల్ మూషికంబులు నొక్కదిక్కునఁ జెర్లాడుచున్నవి చెంతఁగూడి
యింతవింతదలంపఁగ శాంతిమంతు, డెవ్వఁడో యొక్కయోగియీయెడవసించి
తపముసలిపెడుఁ గాఁబోలు నిపుడుగాక, యుండునేనిట్టి మహిమంబులూనరుటెట్లు

వ. అని పొగడుచు మఱియును

క. ఇక్కఁడఁగా దేమవలన్, ముక్కపటీచె నొక్కబోయమును మునుకొనివా
డెక్కడఁబోయెనో యిపుడన, గ్రక్కునఁ నాకాశవాణి గంభీరముఁగన్.

క. ఈవల్మీకంబున నడె శ్రీవల్లభుభక్తసులభు సీతారమణున్
భావింపుచు నున్నాఁడనఁ, గావారలరాక యెఱిఁగి గ్రక్కుననతఁడున్.

శా. ఆవల్మీకముఁ జించికొంచు నుదయాహార్యాంతరాళంబు నం
దావిర్భావమునొందు భాస్కరుని చాయన్ శోణశోణప్రభా
వ్యావల్గత్కిరణంబులోయన జటాప్రాంతంబు శోభిల్లఁగా
వేవేగంజనుదెంచి యమ్మునుల సేవించెం బ్రియంబిచ్చఁగన్.

క. సేవించినిలిచియంజలిఁ, గావించిమునీంద్రులార కరుణాంబుధులా
రా వినుఁడేమివలనం, బ్రావనభావంబుఁ జెంది మాన్యుఁడనైతిన్

వ. అనినవిని యమ్మునీంద్రులందఱు నానందంబున.

క. ఈజటలీ కృష్ణాజిన, మీజపమాలికయు శాంతియెట్లుగలిగెనో
యీజగదొంగకు నోహో, శ్రీజానిస్మరణమహిమ సెప్పన్వశమే.

సీ. ధరనెన్ని పుణ్యతీర్థములైనఁ గలుగనీ రామనామముసరిరావు దలప
నిర్మలస్థితిమించు నిధులెల్లగలుగనీ రామనామముసరిరావు దలప
నానావిధములైన దానముల్గలుగనీ రామనామముసరిరావు దలప
నతిశయంబుగమహా వ్రతములుగలుగనీ రామనామముసరిరావు దలప
రామనామంబె సారంబు రామభద్ర, రామచంద్ర రఘూద్వహ రామయనుచు
ననయము జపింపవలయు దక్కనవిసేల, రామనామంబునకు సరిరావుదలప

వ. ఇదియంతయు రామనామస్మరణంబకాని వేఱొక్కటిగా దెట్టిపాపిష్ఠుండైన నిష్ఠా గరిష్ఠుండగుచు శ్రీరామస్మరణంబుసేయ సకలభోగంబులు గలుగుట నిస్సంశయంబు వీఁడు ప్రహ్లాద నారద పరాశర వ్యాస పుండరీకాదులలో నొక్కఁడుగాని సామాన్యుండుగాఁడని సన్నుతింపుచు సముచితంబుగా వాని వీడుకొని యథేచ్ఛం జనిరి. వాఁడు నవ్వల్మీకంబునం బుట్టుటకతన వాల్మీకియను నామధేయంబు వహించె నవ్వాల్మీకిమహామునియు నంతకంత కంతరంగంబున నుప్పొంగు భక్తివిశేషంబున నిరంతర జపశీలుండై యుండ నతని చిత్తశుద్ధికి నలరి రామభద్రుం డొక్కనాఁడతని యగ్రభాగంబున.

సీ. కోరుకలపంటగల్గుటకు వ్రాలెడు మేఘమనఁగను వినీలకాయంబు మెఱయ
ఖలజనులకాయువుల్ వ్రాయు తూలికనాఁగ వాలికతూపాక్క కేలనమర

హస్తదైర్ఘ్యముచూపునను వునఁ గాంచన ఘనకార్ముకము భుజాగ్రమున వ్రేల
నీలాద్రిమేఖల నిండారునీరెండ చెలువునబంగారు వలువు దనరఁ
మహితకరములజిగిగండమండలమున, దాండవము జూప నుద్దండ పుండరీక
పత్రరుచిహిండనంబులఁ జాలువెట్టు, క్రాలుఁగన్నులఁ గృపయొలుకఁ గానుపించె

సీ. పసిడిగింటెంపు నుప్పటి కప్పులోపాలు కమ్మకస్తూరితిలకమ్ము భళిర
శరచాపములు వూను సరవియమ్మమ్మ మాణిక్యకోటీరంబు నీటువాపు
నిగనిగమనుచిన్న నగవులాహా మణి మకరకుండలముల మహిమ మేలు
తళుకుగుంకుమపుఁ గఁదపు బూతయయ్యారె హారవల్లికల యొయ్యారమౌర
మించెననెంచఁదగు లీలఁ గాంచిమంచి, మించిజిగిమించు నెమ్మేని మెలతగూడి
చల్లఁజూపులఁ గరుణారసంపుఁ జల్లు, జల్లుచును నిల్చె శ్రీరామచంద్రుఁ డెదుట.

గీ. జానకీజాని యిట్లు సాక్షాత్కరింప, నత్తపస్వియు నానంద మత్తచిత్త
వృత్తుఁడగుచును నతులు గావించి లేచి, కరయుగంబు నిటాలభాగమునఁ జేర్చి.

సీ. జయదశరథ సుధాజలధిరాకాచంద్ర జయతాటకాభిధా చటులబాణ
జయగాధినందన సవనరక్షణదక్ష జయసుబాహూత్సాహ శమనబాహ
జయగౌతమాలిగనా శాపవిమోచన జయకృతానంగజిచ్చాపభంగ
జయభూమికన్యకోపయమ లీలాలోల జయవాలినిగ్రహా శ్చర్యశౌర్య
జయపయోనిధిలంఘన జాంఘికబల, జయదశానన ఖండనచండకాండ
జయవిభీషణ పోషణాసక్తచిత్త, జయయయోధ్యాభిషిక్త శ్రీ జనకజాప్త.

ఉ. శ్రీరఘురామ భానుకులశేఖర మీపదపద్మసేవ మం
దారనగంబు ముంగిటి నిధానము తంగేటిజున్ను కొంగుబం
గారము వేల్పుమానికము కైవసమైనధనంబు చేరువౌ
మేరువు కామధేనువు సమీపసుధాంబుధి మాకు నెప్పుడున్.

సీ. కట్టఁగాలువ కదా కల్లోలినీభర్త చెఱకుఁబట్టేము గదా శివునిధనువు
కలువరేకులజోక గద సప్తపాలముల్ పలుకుటీగియె గదా తలఁప లంక
కందుకంబు గదయ్య దుందుభికాయంబు కాలగిరినబొమ్మ గద యహల్య
నూటికంబముగదా సురవైరిదేహంబు పెట్టుఁజెట్టుగదా విభీషణుండు
తెరువునకు నడ్డమా లేఁతతీవఁ దూఁచు, కరణిఁగద కబంధభూజవిఖండనంబు
నీకు నీమహత్త్వంబు వర్ణింపఁదరమె, పరికటగుణసాంద్ర దశరథరామచంద్ర.

వ. అని సన్నుతించిన సంతసించి రామభద్రుండు నిర్ణిద్రితాత్పర్యంబున నమ్మునివ
ర్యుని మస్తకంబున హస్తస్పర్శకంబు గావించి యోమునికులతిలకా! నీ భక్తికి
మెచ్చితి. మచ్చరితంబు భవ్యంబగు కావ్యంబుగా నొనరింపుమని యానతిచ్చె. నయ్యె
నంత నవ్వాల్మీకిమహామునియు నాజానకీవల్లభుని భక్తసులభత్వంబుఁ గొనియాడి
సుధాబిందుబంధుర తరంగలింగణాధార ధారంధరవిదుషీణీ మృదులపదసందర్భ
రసగర్భితార్థచమత్కారపారాయణంబుగా రామాయణంబు వక్కాణించె నట్టి
రామాయణంబు సకలలోకప్రసిద్ధంబగు టెఱుంగుదురే కదా నింక నేమి వినవలతు
రని యడిగిన నమ్మునిపుంగవు లందఱు నప్పర్వతుం బూజించి నీవలన నిట్టి పుణ్య
కథ వినంగలిగె. కృతార్థులమైతి మని సన్నుతించి వెండియుం దత్కథావిశేషంబు
బ్రశంసించుచు నుండి రంత.

క. శ్రీకరమై తగున వ్వా, ల్మీకిచరిత్రంబు భక్తిమెఱయఁగ నెప్పుడున్
జేకొని చదివిన వినినన్, జేకురు వారల కభీష్టచిరశోభనముల్.

శా. శ్రీరంగధ్వజమధ్య వింధ్యమరరాజీకోటీకోటీరకో
టీరత్నప్రజసూత్న కాంతి నివహాటీకాంఘ్రిపంకేరుహా
క్షీరోదస్వదగార ... ... ...

గద్యము. ~~ఇది శ్రీరామ~~చంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వతవిశేష నిరర్గళ
వాగ్వైభవాశేష సరస సాహిత్యకళాభోజ సత్యసంభాషిత ముఖాంభోజ సకలసా
మ్రాజ్యధౌరేయ నిత్యవితీర్ణి ధారా రాధేయ నిరతావారితాన్నసత్రి పంతోషితప్రి
తిదివస పంచాశత్సహస్రభూసుర బహువారావర్తిత మహాదానవైభవావర్తిత
కీర్తి భాసుర నిజనామాంకితాకలంక వస్తుసమగ్ర బహుళాగ్రహారభూషిత చోళ
ధారామండల నిఖిలభోగవిభవనిర్జితాఖండల సాధితసముద్రాంతరద్వీప పరనృపా
లసంస్తుతప్రతాప నేపాళభూపాలస్థాపనాచార్య కర్ణాటరాజపూజనీయధౌరంధర్య
రామసేతు శ్రీరంగవిజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభ
ద్రసర్వజనసంభావిత గాంభీర్యముద్రావినిర్జితసముద్ర సదాశ్రితభరణ దీక్షాదక్ష
దక్షిణసింహాసనాధ్యక్ష రాజాధిరాజసన్నుతా సాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌ
దార్య సుజ్ఞానజనక సతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూధ భువనశోభితగు

# వాల్మీకిచరిత్రము.

ణసనాథ [illegible]ప్రతిప[illegible]గృహీత సామంతమహీకాంత విమోచనశ్లాఘనీయ బాహా బల [illegible]ర్తి మాంబాగర్భశుక్తిముక్తాఫల చినచెవ్వనృపాలపుత్ర సజ్జనస్తోత్ర పాత్ర రూపరేఖావిజితకుసుమసాయక సకలధర్మసంధాసంధాయక రఘునాథనాయకప్రణీతంబైన వాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.

సంపూర్ణము.